2 భాగములు పిప్పలిచూర్ణములో గలిపి తెల్ల అరనూనెతో గాని లేక తేనెతో గాని సేవించిన 18 కుష్ఠువులు 80 వాతరోగములు సర్వరోగములు వీనిని హరింపంజేయు.

శ్లో॥ [ఆయుర్వేదే] శుధతాళకంతుల్యాం స్నుహీక్షీరేణ మర్దితమ్॥ కృత్వాతచ్చక్రికాంశోష్య కింశుకస్యతుభస్మనా। ఖర్పరింఘటమాత్రంచ విధాయాస్మిన్ నివేశయేత్। చక్రికోపరిచించాద్య క్షారైశ్చుల్ల్యాంవిపాచయేత్। పూరితంచఘటీయంత్రే క్షారేణైవపిధాయచ॥ క్రమాగ్నినాచైకదినం స్వాంగశీతళముద్ధరేత్। సామర్ద్యచవ్రీహిమాత్రం శర్కరేణఘృతేనవా॥ ప్రాతస్సాయంప్రదాతవ్యం సర్వవాతవికారజిత్। వాతగ్రంధౌధాతుశోషే ప్రసృతౌరసవైకృతౌ। అష్టాదశ సుకుష్ఠేషు గవ్యాజ్యం దధితక్రకమ్॥

తా. శుద్ధిచేసిన తాళకమునకు సమముగ శుద్ధిచేసిన మణిశిలచూర్ణము గలిపి బ్రహ్మజెముడుపాలతో మర్దించి బిళ్ళచేసి యెండించి మోదుగక్షారమును నూరి యూరుదుకలె నోరు వెడల్పుగనుండునటుల 1 కుండముజేసి అందు చింత మొదలగు వానిక్షారములపరచి దానిపై తాళకపుబిళ్ళనునిది దానిపై చింత మొదలగు వాని క్షారములపరచి మతియొకకుండలో నునిచి దానినిండ చింత మొదలగువాని క్షారములబోసి గట్టించి బాగుగ చీలమన్ను లేపనము జేసి పొయిమీదనునిచి క్రమాగ్నులతో 1 దినము వండి యుండలి తాళకపుబిళ్ళల స్వాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి మర్దించిన తెల్లగభస్మంబగు యీ తాళకభస్మములో వరిగింజయెత్తును పంచదారతోగాని లేక నేతితో గాని సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన 80 వాతరోగములు వాతగ్రంధులు సప్తధాతువులు శోషించుట వాపు రసవైకృతము 18 కుష్ఠువులు వీనిని నశింపంజేయు. పథ్యము ఆవునెయ్యి పెరుగు చల్ల వీనిని సేవింపవలయు (శుద్ధిచేసిన తాళకమును ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో 1 దినము వేపాకురసముతో 8 దినములు మర్దించి నిడుపుగకణికలు జేసి యెండించి పిదప యేపి విభూతినియుంటగ గట్టి దానిందోలిచి అందు తాళకపుకణికలనునిచి దానిపై యేపి బూడిదబోసి గట్టించి దానిపై చీలమన్ను లేపనముజేసి యెండించి 4 ఝాములువండిన భస్మంబగు. ఇట్టి తాళకపు భస్మములో 1 భాగమును గ్రహించి దానితోడ 2 భాగముల పిప్పలి చూర్ణమును గలిపి



తేనెతోనూరి సేవించిన క్షయము పాండువు చిప్పికా కాసము అతిసారము వాతరోగము కుష్ఠువు వీనిని హరింపంజేయు పథ్యము (నల్లవరిబియ్యపు కంటకము నెయ్యి తో టకూర వీనిని భక్షింపవలయు.

శ్లో॥ దేహేకిలాసేనంజాతే కండ్వావాచర్మపీడితమ్।
కాసమర్దక బీజానిమూలకానాంతథైవచ।
గంధపాషాణమిశ్రాణిసిధ్మహాంతి నసంశయః॥

తా. శరీరమున శిబ్బెముగలిగి దురదవలన చర్మము పొట్టువలె రాలుచుండిన దురదగొండి విత్తులు ముల్లంగివిత్తులు గంధకము పుల్లిపాషాణము వీని నుదకముతో నూరి లేపనముజేసిన శిబ్బెము నిస్సంశయముగ హరించు.

గంధకోత్పత్తి తత్సేవనా క్రమము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శృణుదేవిప్రవక్ష్యామియతోత్పన్నశ్చగంధకః తమహంకథయిష్యామి శృణుష్వాయతలోచనే। అమృతోద్ధితస్సాక్షాద్దివ్యతేజామహాగుణః। పీతశ్చైవతథాశ్వేతః కపోతశ్చతృతీయకమ్। అరక్తశ్చచతుర్థస్స్యాత్ర్కమోత్తరగుణంప్రియే॥ తస్యగంధస్యగంధేనమోహితాశ్చాపిదానవాః॥ గంధకోనామతేనైవ విఖ్యాతఃక్షితిమండలే। తథాక్రమగుణాశ్చైవ భవంతిగిరిజాఽపి। తత్రక్షేత్రోత్థితస్యైవ శుద్ధింకుర్యాద్విచక్షణః॥ తత్రాసితక్రిమేణైవ తృతీయంచసమాహితః॥ * వమనంరేచనంకుర్యాత్కర్తవ్యస్యచనిశ్చయః। క్రియాంకృత్వాప్రయత్నేన శుచిర్గంధంసమాచరేత్। శుభేముహూర్తేనక్షత్రే హ్యర్చయిత్వాజగద్గురుమ్। విధినైవతుసుప్రాజ్ఞః కర్తవ్యోసిత్యమేవహి॥

తా. ఓపార్వతీ ! గంధకము జనించునట్టిస్థలమును వచించెద వినుము గంధకము క్షీరసముద్రమునజనించి దివ్యమైన తేజస్సు మహాగుణసంపత్తిగలదై పసపు వర్ణము శుభ్రి

* వమనం రేచనంకృత్వా శుద్ధించైవ సమాచరేత్॥

శ్వేతవర్ణము కపోతవర్ణము యొకింతరక్తవర్ణము అన 4 విధంబులు గలదై 1 దానికంటె నొకటి గుణాధిక్యము గలదిగనుండు. ఈ గంధకము యొక్క పరిమళము వలన దానవులు మోహితులైనందున దీనికి గంధకమను నామము భూమండలమున గలిగె. ఇటుల నేపర్వతమున జనించిన గంధకము సగా 4 విధంబులుగలదై 1 దానికంటె నొకటి గుణాధిక్యము గలదిగ నుండు. భూమియందు జనించిన 4 విధములగు గంధకములలో మూడవదియైన కపోతకమును దానిని బుద్ధిమంతుడగు వైద్యుడు క్రమముగ శుద్ధిచేసిన రోగికి వమనవిరేచనంబులు చేయించి తాను స్నానాదులచే శుద్ధుడై సుముహూర్తనక్షత్రంబున విధిప్రకారము జగద్గురువును బూజించి గంధక కల్పము నొసంగవలయు. మరియు గంధకకల్పము నొసంగునపుడెల్ల యీ విధినే వైద్యుడాచరింపందగు.

### గంధకసేవనయందు పథ్యాపథ్యములు.

శ్లో॥ భోజ్యానిచ ప్రవక్ష్యామి త్యాజ్యాని వివిధాపిచ ।
షష్టికాశ్చ తథాశాల్యో గోధూమాశ్చ విశేషతః ।
జాంగలానిచ మాంసాని † లాఘవాని ప్రదాపయేత్ ।
ఏవంముద్గాసితాస్సర్పి స్సితా క్షీరం మధూత్కరమ్ ।
ఏవంభోజ్యం తథాపథ్యం మయాఖ్యాతం వరాననే ॥

తా. గంధకసేవన కాలమున 60 దినములకు ఫలించిన వడ్లబియ్యము గోధుమలు జాంగలమాంసము లఘుకరద్రవ్యములు వల్లపెసలు నెయ్యి పంచదార పాలు మద్యము అనువానిని పథ్యమునందు గ్రహింపవలయు. సుందరమైన ముఖముగల యోపార్వతీ! యిటుల పథ్యాపథ్యంబులు నాచే జెప్పంబడియె.

### గంధకసేవనోపయుక్త మంత్రము.

శ్లో॥ అథమంత్రం ప్రవక్ష్యామి గంధకస్యచ భక్షణే ।
ఓంనమో మృత్యుశిఖాయ అమృతరూపజీవనే ।
దానవేంద్రేణ చాజ్ఞాత అమృతత్వం దేహిస్వాహా ॥

తా. గంధకము సేవించునపుడు " ఓంనమో " అను మంత్రమును పఠింపవలయు.

† ఛాగలాని ప్రయోజయేత్ — మేకమాంసము.



### కుష్ఠురోగమునకు గంధకకల్పము.

శ్లో॥ గంధకస్య పలంచైవ సూతకస్య పలంతథా । గగనస్య పలం
చైవ హాటకస్య పలంతథా । నీలాంజనం పలంచైవ త్రిఫ
లానాం పలత్రయమ్ । ద్విసప్తకంతు పక్షంవా షణ్మాసంవా
ప్రయోగతః । వలీపలిత నిర్ముక్తో సర్వరోగ వివర్జితః । దివ్య
దృష్టిః ప్రవర్తేత జీవేదబ్దాయుతంనరః । వాతారి తైల
సంయుక్తం త్రిఫలా గుగ్గులేనచ ॥

తా. శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన రసము అభ్రకభస్మము స్వర్ణభస్మము శుద్ధిచేసిన నీలాంజనము యివి దినుసుకొక్కొకపలము త్రిఫలములు 3 పలములు యిటుల వీనినెల్ల చూర్ణముచేసి ఆముదము త్రిఫలములు శుద్ధిచేసిన మహిషాక్షిగుగ్గిలము అను వాని యనుపానముతోడ 14 దినములుగాని లేక 15 దినములుగాని లేక 6 మాసములుగాని సేవించిన వలీపలిత విముక్తుండై సర్వరోగవివర్జితుండై దివ్యదృష్టిగలవాడై 10000 సంవత్సరములు జీవించు.

శ్లో॥ గంధకస్య పలంచైకం రసస్యార్థం క్షిపేత్తథా । కుమారీ
రససంమృష్టం దినైకం గోళకీకృతమ్ । అంధమూషా కృతం
ధ్మాతం లేహయేన్మధుసర్పిషా । మాషమాత్ర ప్రయో
గేణ జరా దారిద్ర్యనాశనమ్ ॥

తా. శుద్ధిచేసిన గంధకము 1 పలము శుద్ధిచేసిన రసము ½ పలము యీ రెంటిని కలబందరసముతో 1 దినము కాటుకవలెమర్దించి ముద్దజేసి అంధమూషలోనునిచి సంధిలేపనముజేసి నిప్పులోబెట్టి యూది దానిని దీసి మాషప్రమాణమును తేనె లేక నేతితో భక్షించిన జరాదారిద్ర్యముల హరింపజేయు.

శ్లో॥ గంధకస్యపలేద్వేతు సూతకస్యపలంతథా ।
కచ్ఛపయంత్రగతంపక్వం లేహయేన్మధుసర్పిషా ।
మాషమాత్ర ప్రయోగేణ కుష్ఠం హరతిదారుణమ్ ॥

తా. శుద్ధిచేసిన గంధకము 2 పలములు శుద్ధిచేసిన రసము 1 పలము యీరెంటిని కజ్జలిగనూరి కచ్ఛపయంత్రములో నునిచి పాకముజేసిన భస్మంబగు అందొక మాష ప్రమాణము తేనె నేతితో భక్షించిన దారుణమైన కుష్ఠమును హరింపజేయు.

శ్లో॥ త్రిఫలా గంధకంచూర్ణం భృంగరాజ సహాన్వితమ్ ।
సంవత్సర ప్రయోగేణ జీవేద్వర్ష శతంనరః ॥

తా. త్రిఫలములు శుద్ధిచేసిన గంధకము వీనిని చూర్ణముజేసి గుంటగలగరాకు రసముతో 1 సంవత్సరమువరకు సేవింపుచుండిన 100 సంవత్సరములు జీవించు.

శ్లో॥ గంధకస్యపలంచైవ పిబేత్క్షీరేణ వా నిశి ।
అర్ధమాసప్రయోగేణ హంతికండూంవిచర్చికామ్ ॥

తా. 1 పలము శుద్ధిచేసిన గంధకమును రాత్రులయందు పాలలోవైచి గాని ½ మాసమువరకు సేవింపుచుండిన దురద విచర్చిక కుష్ఠము హరించు.

శ్లో॥ ఘృతంగవ్యం పలంచైవ తదర్ధం చైవసూతకమ్ ।
గంధకం పలమాత్రేణ జరావ్యాధి వినాశనమ్ ।
వాచస్పతి సమోబుద్ధ్యా షణ్మాసా చరణేన తు ॥

తా. ఆవునెయ్యి 1 పలము శుద్ధిచేసిన రసము ½ పలము శుద్ధిచేసిన గంధకము 1 పలము యీటుల వీనిసేకముజేసి 6 మాసములు సేవించిన ముదిమిని హరింపంజేయుటయే గాక బృహస్పతితో సమానమైన బుద్ధిని గలుగంజేయు.

శ్లో॥ గంధకం త్రిఫలాయుక్తం ఘృతేన మధునాసహ ।
భక్షితంతు మహారోగం హంతిమాసేనదారుణమ్ ॥

తా. శుద్ధిజేసిన గంధకము త్రిఫలములు వీనిని చూర్ణముజేసి నేతితోగాని తేనెతోగాని 1 మాసమువరకు సేవింపుచుండిన దారుణమైన కుష్ఠము హరించు.

### స్వర్ణకరణ విధి.

శ్లో॥ గంధకం చాంధమూషస్థం సబీజం చైవమర్దితమ్ ।
భూమిస్థం మాసమేకంతు తారం భవతికాంచనమ్ ॥

తా. శుద్ధిజేసిన గంధకమును కాలకూటము వత్సనాభి శృంగము ప్రదీపకము హాలాహలము బ్రహ్మపుత్రము హారిద్రము సక్తుకము సౌరాష్ట్రికము అను మహావిషంబులచే మర్దింపబడి సప్తకంచుక దోషరహితముగ చేయబడినరసముతో నేకముజేసి బాగుగ మర్దించి అందుమూషలో నునిచి 1 మాసము భూస్థాపనముజేసి దానిని గరిగించి వెండితోదగలిపిన బంగారమగును.



### గంధకకల్ప సేవనామహిమ.

శ్లో॥ అభ్రకంహారబీజంచ షడంశేనతు కాంచనమ్। ధ్మాతంప్రవసృత
మూషాయాం గంధకేన సుసంయుతమ్ । మూషాంత్యక్త్వా
సమారోహేదూర్ధ్వంతు ఖగవద్రసః। రాజికార్ధార్ధమాత్రేణ
పర్వతానపి వేధయేత్ । రాజసర్షపమాత్రేణ తద్రసంయది
భక్షితమ్ । ఖేచరత్వమవాప్నోతి క్రీడతేనిర్జరైస్సహ ॥

తా. అభ్రకభస్మము పైప్రకారము శుద్ధిచేయబడిన రసము యీ 2 కు 6 వ భాగము సువర్ణభస్మము శుద్ధిచేసిన గంధకమును గ్రహించి విశాలమైన మూషలో నునిచి యూదిన రసము పక్షివలె పొడవుగ నెగురును. పిదప వాసములో రాజికార్ధప్రమాణమును సేవించిన పర్వతముల భేదింపదగిన బలముగలవాడగు, మఱియు తెల్లఆవగింజంత సేవించిన దేవత్వమునుజెంది దేవతలతో గ్రీడించు.

శ్లో॥ తుల్యాయసంతథాసూతంగంధరాజేనరంజితమ్ । మ్లేచ్ఛంచ
ఘటీయంత్రేణతూరేత్రైవపిధాయచ। క్రమాగ్నినాచైకదినం
సాంగశీతలముద్ధరేత్ । సంమర్ద్యంచవ్రీహిమాత్ర శర్కరేణ
ఘృతేనవా। ప్రాతస్సాయంప్రదాతవ్యంసర్వవాతవికారజిత్।
వాతగ్రంథౌ ధాతుశోషే ప్రసారే రసవైకృతౌ । అష్టాదశ
సుకుష్ఠేషు గవ్యాజ్యం దధితక్రకమ్ ॥

తా. ఇనుపభస్మము శుద్ధిచేసిన రసగంధకములు తామ్రభస్మము వీనిని సమభాగములుగ మర్దించి ఘటీకాయంత్రములో నునిచి దానిని చింత మొదలగు వాని క్షారములలోమూసి క్రమాగ్నులతో 1 దినము వండి సాంగశీతలమునవీసి మర్దించి వడ్లగింజంతను శర్కరతోగాని లేక నేతితోగాని సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన సర్వవాత వికారములు వాతగ్రంథులు ధాతుశోష అతిసారము రసవైకృతము 18 కుష్ఠములు వీనిని హరింపంజేయు. ఆవునెయ్యి ఆవుపెరుగు ఆవుచల్ల వీనిని పథ్యమునం దునిచికొనవలయు.

### సువర్ణ కరణ విధి.

శ్లో॥ హేమసైరికసంయుక్తం సమాంశం గంధకంరసమ్ ।
దేవదాలీ రసేనైవ తారం భవతికాంచనమ్ ॥

తా. బంగారు కావిరాయి యివి దినుసు కొక్కొకభాగము శుద్ధిచేసిన రసగంధకములు దినుసుకు 2 భాగములు యిటుల వీనిని ఖల్వములోనునిచి దాసరదంగిరసముతో మర్దించి వెండిపై లేపనముచేసి పుటంబిడిన బంగారమగు.

శ్లో॥ సూతకేన సమాయుక్తం ధాత్రీ గంధకసంయుతమ్ ।
సంవత్సర ప్రయోగేణ చిరాయుః పురుషోభవేత్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన వెల్లికాయగంధకము యీ 2 ని మర్దించి పుటంబిడిన రసభస్మంబగు. ఈ రసభస్మమును నొకవత్సరము సేవింపుచుండిన నరుడు దీర్ఘాయువుగలవాడగు.

శ్లో॥ తారంసుగంధంసమషోడశాంశం సుల్బాభ వేహ్నార్యశశాంకవర్ణమ్। మయూరకేణసంయుక్తంపాండురోగంవినాశయేత్।
మహాకాలాయ సంయుక్తం హారే త్కుష్ఠాన్యశేషతః ॥

తా. రజతభస్మము శుద్ధిచేసిన నల్లగంధకము యివి సమభాగములు, ఈ రెంటికి 16వ భాగము తామ్రభస్మము గలిపి మర్దించి పుటంబిడిన సూర్యచంద్రవర్ణ తుల్యంబుగనగు, దీనిని బ్రహ్మమేడిచూర్ణములో గలిపి భక్షించిన పాండువును మహాముసినిచెక్క చూర్ణముతోడం జేర్చి భక్షించిన కుష్ఠువులు హరించు.

శ్లో॥ శుల్బస్య గగనస్యాపి హేమధాతో ర్విధాపివా ।
సమాంశం పిష్టకంకృత్వా అంధమూషా నివేశితమ్ ।
నింబపంచాంగసంయుక్తం కుష్ఠమౌదుంబరంజయేత్ ।
శశిరేఖా సమాయుక్తం కల్పాయు ర్జాయతే నరః ॥

తా. తామ్రభస్మము అభ్రకభస్మము సువర్ణభస్మము వీనిని సమభాగములుగా జేసి ముద్దచేసి అంధమూషలోనునిచి పుటంబిడి వేపసమూలానుపానముతోడ భక్షించిన ఔదుంబరకుష్ఠమును హరింపజేయును. మరియు దీనిని తిప్పసత్తుతోడ భక్షించినచో కల్పకాలమువరకు జీవించు.

గంధక రసాయనము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధోబలిర్గో పయసావిభావ్య తతశ్చతుర్జాతగుడూచికాభిః। పథ్యాక్షధాత్ర్యోషధభృంగరాజై ర్భావ్యోష్ట



వారం పృథగార్ద్రకేణ। సిద్ధేసితాం యోజయతుల్యభాగాం రసాయనంగంధకసంజ్ఞితంస్యాత్ । ధాతుక్షయంమేహగణాగ్నిమాంద్యం శూలంతథాకోష్ఠగతాంశ్చరోగాన్ । కుష్ఠాన్యథాష్టా దశభేదవంతి నివారయత్యేవ చరాజరోగమ్ । కర్షోన్మితంసేవితమేతిమర్త్యో వీర్యంచపుష్టిం బలవాగ్ని ప్రదీప్తిమ్ । వమనం రేచనంపూర్వం శుద్ధించైవ సమాచరేత్ । జాంగలాని తుమాంసాని ఛాగలాని ప్రయోజయేత్ ॥

తా. ఆవుపాలతో శుద్ధిచేయబడిన గంధకమును చాతుర్జాతకములు తిప్పతీగ కరక్కాయ గచ్చపలుకులు ఉసిరికవరుగు శొంఠి గుంటగలగర అల్లము అనువాని రసములలో ప్రతిదానిచే 8 దేసి మార్లు భావనచేసి పిదప దానికి సమముగ పంచదారగలిపిన గంధకరసాయనమగును. దీనిని కర్షప్రమాణము సేవించిన ధాతుక్షయము సర్వమేహములు అగ్నిమాంద్యము శూల కోష్ఠగతోపద్రవములు సర్వకుష్ఠువులు మొదలగు బలిష్ఠమైన రోగముల హరింపజేయుటయేగాక పరాక్రమము పుష్టి బలము వీనిని సగా కలుగంజేయును. మరియు నీరసాయనము నిచ్చుటకు ముందు వమన రేచనముల గొనంగవలయును. మరియు జాంగలమాంసమును మేకమాంసమును భోజనమునందు జేర్చికొనవలయును.

శ్లో॥ యావనాళంచ తక్రంచ వ్యంజనం తైలపాచితమ్ । దుగ్ధంమాహిషసర్పిశ్చలవణంచవివర్జయేత్ । తథాతీక్ష్ణకషాయాశ్చ కాంజికం కేవలంతథా । అత్యుష్ణంచాతిశీతంచ నసేవేత కదాచన । యవాన్నక్షుద్రధాన్యానివిషమాన్నంవ్యవాయకమ్ । సంజాతంచ పతేద్వీర్యం తస్మాత్సర్వం పరిత్యజేత్ । స్త్రీయం యానాధిరోహంచ వహ్నించైవా తపంతథా । యదిదం పరమంగుహ్యం తత్ర ప్రీత్యామయోదితమ్ । గోపనీయం ప్రయత్నేననదేయంయస్యకస్యచిత్ । అమృతంచతథాచైవ శుద్ధం కృత్వాతుగంధకమ్ । అమృతం విధిసంయుక్తం విధిహీనంచ తద్విషమ్ । యస్తువై భక్షయేన్మోహా త్సాధకస్సిద్ధికాంక్షయా । సమూఢోగన్ధకంప్రాశ్య క్షిప్రంమ శ్యేద్యమాలయమ్॥

తా. పై రోగములను సేవించునపుడు జొన్నలు మజ్జిగ నూనెతో చేయ బడిన పదార్థములు బర్రెపాలు బర్రెనెయ్యి లవణము తీక్ష్ణద్రవ్యములు కషాయద్రవ్యములు కలి అత్యుష్ణము అతిశీతలముగల ద్రవ్యములు యవాన్నము క్షుద్రధాన్యములు విషమాన్నము * వ్యవాయికద్రవ్యములు స్త్రీసంపర్కము బాహానము అగ్ని యెండ అనుపానిని వర్జింపవలయు. ఇటు చేయని యెడల శుక్రము నష్టంబగు. ఓ పార్వతీ! ఇట్టి మహారహస్యముగల యీ రోగములను ప్రీతివలన నీకు నేను వచించితిని. కావున దీని నెవ్వరికిం జెప్పక రహస్యముగ నుంచుకొనుము. క్రమముగ శుద్ధిచేయబడిన గంధకమును సేవించిన అమృతప్రాయంబగు విధి విహీనముగ సేవించిన విషతుల్యంబగు, గంధక భక్షణయం దిచ్ఛగలవాడు అజ్ఞానము వలన దానిని విధివిహీనముగ భక్షించిన యమాలయంబున కేగు.

శ్లో॥ గంధకస్య పలంన్యస్య సూతకస్య పలంతథా। నాగస్యతు
పలంచైవ టంకణస్యపలంతథా। కన్యాపలత్రయంచైవ విషా
ణస్య పలత్రయమ్।ద్విసప్తకాద్విశేషేణ షణ్మాసాత్తు ప్రజా
యతే। దివ్యదృష్టిః ప్రవర్తేత జీవేదా చంద్రతారకమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన రసము నాగభస్మము వెలిగారము యివి దినుసు కొక్కొకపలము కలుబంద 3 పలములు దుప్పిభస్మము 3 పలములు యిటుల దీని నేకముజేసి 14 దినములు భక్షించిన సర్వకుష్ఠువులు హరించు. మరియు దీని 6 మాసములు భక్షించిన దివ్యదృష్టిగలవాడై చంద్రసూర్యులుండువరకు జీవించు.

శ్లో॥ గంధకంత్రిఫలాయుక్తం మధురత్రయమిశ్రితమ్।
భక్షయేత్ప్రాతరుత్థాయ వలీపలిత శాంతయే॥

తా. శుద్ధిచేసిన గంధకములో త్రిఫలచూర్ణము గలిపి పంచదార తేనె నెయ్యి అనుపాని యనుపానముతో ప్రాతఃకాలమున సేవించిన వలీపలితములు హరించు.

కుష్ఠువులయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] శాలీయయవగోధూమాః శ్యామాకాశ్చ
ప్రియంగవః। ముద్గామసూరాస్తువరీ తిక్తశాకానిజాంగలమ్।
వరాపటోల ఖదిర నింబశ్చ బృహతీఫలమ్। కస్తూరీగంధ

* వ్యవాయికద్రవ్యములన—గంజాయియాదు నల్లమందు మొదలగునవియు.



సారశ్చ కుంకుమంచ సరామఠమ్। యథాదోషం సమస్తాని
పథ్యాన్నేతానికుష్ఠినామ్॥

తా. ప్రాతవడ్లు యవలు గోధుమలు చామలు కొఱ్ఱలు పచ్చపెసలు చిఱుసెనగలు కందులు చేదుగలకూరలు జాంగలమాంసము పిల్లిపీచర పొట్లకాయ చంద్ర వేపపువ్వు నేలములకపండ్లు కస్తూరి చందనము కుంకుమపువ్వు యింగువ యివి కుష్ఠువులయందు దోషానుగుణ్యముగ పథ్యకరంబులు.

కుష్ఠువులయం దపథ్యము.

శ్లో॥ అన్నపానం హితంకుష్ఠే నత్వామ్లలవణోషణమ్।
దధిదుగ్ధగుడంసూప తిల మాషాం స్త్యజేన్నరః॥

తా. పులుసు వుప్పు కారముగల యన్నపానములు పెరుగు పాలు బెల్లము పప్పు నువ్వులు మినుములు యివి కుష్ఠరోగమునం దపథ్యకరంబులు.

విసర్ప నిదానము.

శ్లో॥ [మాధవనిదానే]లవణామ్లకటూష్ణాదిసంసేవాదోషకోపతః।
విసర్పస్సప్తధాజ్ఞేయ స్సర్వతః పరిసర్పణాత్॥

తా. ఉప్పు పులుసు కారము వుష్ణము మొదలగు పదార్థముల సేవించుటవలన వాతాదిదోషములు ప్రకోపించి 7 విధములైన విసర్పరోగముల గలుగంజేయు. ఇది సర్వశరీరమునందు వ్యాపించుటచే విసర్పమనంబడు.

శ్లో॥ రక్తంలసీకాత్వఙ్మాంసం దూష్యం దోషాస్త్రయోమలాః।
విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయాస్సప్తధాతవః॥

తా. రక్త రస త్వఙ్మాంసములు వాత పిత్త శ్లేష్మములు దుష్టంబు లగుటవలన సప్తధాతువులయందు విసర్పరోగము జనించు.

వాతవిసర్ప లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వాతాత్పరీత సదృశా స్ఫోటాస్స్యు
శ్శాగ్నిదగ్ధవత్। సంజ్ఞానాశో వ్యథాశోషో నిద్రాతి శ్వాసక
జ్వరాః। యథావాత జ్వరేచిహ్నం తథావాత విసర్పకే।
విరేచవమనంచైవ లేపనాసృగ్విమోక్షణైః॥

తా. ఉలవలతో సమానముగ పొక్కులు గలిగి కాలినట్లుండుట ప్రజ్ఞలేకుండుట వేదన శోషగలుగుట మిక్కుటముగ నిదుర వుబ్బసము జ్వరము వాతజ్వర చిహ్నము గలుగుట ఈ లక్షణములుగలది వాతవిసర్పియని దెలియవలయు. దీనియందు రేచన వమనముల కొసంగుటయేగాక లేపనములను జలగలవలన రక్తస్రావములు జేయింపవలయు.

### పిత్త విసర్ప లక్షణము.

శ్లో॥ పిత్తాత్పిత్తజ్వరేయస్య చిహ్నం ద్రుతగతి స్తథా।

తా. పిత్తజ్వర లక్షణంబులన్నియుం గలిగి పిత్తధాతువు తీవ్రముగ నడుచుచుండిన పిత్తవిసర్పియని దెలియవలయు.

### శ్లేష్మవిసర్ప లక్షణము.

శ్లో॥ కఫాత్కండూ యుతస్స్నిగ్ధః కఫజ్వర సమానరుక్।

తా. దురద మెఱుపు శ్లేష్మజ్వరలక్షణములు గలిగియుండిన శ్లేష్మ విసర్పియని తెలియవలయు.

### సన్నిపాత విసర్ప లక్షణము.

శ్లో॥ సన్నిపాతసముత్థశ్చ సర్వరూపసమన్వితః॥

తా. వాత పిత్త శ్లేష్మ విసర్పిలక్షణంబులన్నియు గలది సన్నిపాత విసర్పియని తెలియవలయు.

### కర్దమ విసర్ప లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కఫపిత్తా జ్జ్వర స్తంభో నిద్రా తంద్రాశిరోరు
జః। అంగావసాదవిక్షేప ప్రలాపారోచకభ్రమాః। మూర్ఛా
గ్నిహానిర్భేదోస్థ్నాం పిపాసేంద్రియ గౌరవమ్। ఆమోపవే
శనం లేప స్స్రోతసాం స విసర్పతి। ప్రాయేణామాశయాంగృ
హ్ణో న్నైకదేశం న చాతిరుక్। పిండకై రవకీర్ణోతి పీతలోహిత
పాండురైః। స్నిగ్ధోసితో మేచకాభో మలిన శ్శోఫవాన్గు
రుః। గంభీరపాకః ప్రాజ్యోష్మా స్పృష్టః క్లిన్నోవదీర్యతే।
పంకవచ్ఛీర్ణమాంసశ్చ స్పష్టస్నాయు సిరాగణః। శవగం
ధిశ్చవిసర్పః కర్దమాఖ్య ముశంతి తమ్।



తా. కఫ పిత్తమువలన తాపముగలుగుట శరీరము స్తంభించుట నిద్ర తంద్ర తలనొప్పి శరీరమున బడలికగలుగుట కాళ్ళుచేతు లీడ్చుట తఱుచుగ వదరుట అరుచి భ్రమ మూర్ఛ అగ్నిమాంద్యముగలుగుట యెముకలు పగిలినటుల నొచ్చుట దప్పి యింద్రియములయందు జడత్వముగలుగుట ఆమముబడుట ముఖాదిస్రోతస్సులయందు కఫము నిండి లేపనము జేయించబడి నటులుండుట ఆమాశయమునపై జనించి కడుబాధా రహితంబై పసుపు యెఱుపు తెలుపువర్ణముగల పొక్కులతోగూడినదై సర్వశరీరమునందు వ్యాపించియుండుట మెఱయుచు నల్లనై నెమలికన్నులయొక్క వర్ణముగలదై మలయుక్తమై వాపు జడత్వము అనువానితో గూడియుండుట లోనంబండుట మిక్కుటముగ యూష్మము గలిగియుండుట అదిమినతోడనే చెమ్మగలుగుట చిట్లినట్లుండుట బురదవలెనే మాంసము శిథిలంబై సిరాస్నాయువులు దొరచికొనియుండుట పీనుగవాసన వేయుట యీ లక్షణములుగలది కర్దమవిసర్పియని తెలియవలయు.

### గ్రంథివిసర్ప లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] కఫేనరుద్ధః పవనః భిత్వా తం బహుధా
కఫమ్। రక్తం వా వృద్ధరక్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్।
దూషయిత్వాచ దీర్ఘాణు వృత్తస్థూల ఖరాత్మనామ్। గ్రంథీ
నాం కురుతేమాలాం రక్తానాం తీవ్రరుగ్జ్వరామ్। శ్వాస
కాసాతిసారస్య శోషహిక్కా వమిభ్రమైః। మోహవై
వర్ణ్య మూర్ఛాంగ భంగాగ్ని సదనై ర్యుతామ్। ఇత్యయం
గ్రంథి వీసర్పః కఫమారుతకోపజః।

తా. స్వకారణమువలన ప్రకోపించిన కఫముచే నడ్డగింపంబడిన వాతము కఫమునుగాని లేక వృద్ధిబొందిన రక్తముగాని భేదించి చర్మము సిరలు స్నాయువులు మాంసము అనువానిజెందించి దోషయుక్తముగజేసి పొడవుగ చిన్నదిగ గుండ్రముగ లావుగ గరగరగ యెఱ్ఱగనుండు గ్రంథులసమూహము గలుగంజేయుట వానియందు మిక్కుటమైన శూల బలమైన జ్వరము శ్వాసము దగ్గు అతిసారము నోరెండుట యెక్కిళ్ళు వాంతి భ్రమ భ్రాంతి వైవర్ణ్యము మూర్ఛ ఒడలువిరుపు అగ్నిమాంద్యము గలుగుట యీ లక్షణములుగలది గ్రంథివిసర్పియని తెలియవలయు. ఇది కఫవాత ప్రకోపము వలన జనించు.

## అగ్నివిసర్ప లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతపిత్తాజ్జ్వరచ్ఛర్ది మూర్ఛాతీసార తృ
డ్భ్రమైః। అస్థిభేదాగ్నిసదన తమకారోచకై ర్యుతః । కరోతి
సర్వమంగంచ దీప్తాంగారావకీర్ణవత్ । యంయం దేశం విసర్ప
శ్చ విసర్పతి భవేచ్చసః । శాంతాంగారాసితోనీలో రక్తోవా
శూపచీయతే।అగ్నిదగ్ధ ఇవస్ఫోటైః శీఘ్రగత్వాద్రుతంచసః।
మర్మానుసారీ విసర్పస్స్యా ద్వాతోతిబలవ స్తతః। వ్యథేతాం
గంహరేత్సంజ్ఞాం నిద్రాంచ శ్వాసమీరయేత్ ।హిక్కాంచ
సతతోవస్థా మీదృశీం లభతేనరః । క్వచిచ్చర్మా రతిగ్రస్తో
భూమిశయ్యాసనాదిషు । చేష్టమాన స్తతఃక్లిష్టో మనోదేహస
ముద్భవామ్।దుర్బోధామశ్నుతే నిద్రాం సోగ్నివీసర్పఉచ్యతే॥

తా. వాతపిత్తములవలన గలిగిన విసర్పమునందు జ్వరము వాంతి మూర్ఛ అతిసారము దప్పి వొడలువిరుచుట యెముకలు విరిగినటుల నొచ్చుట అగ్నిమాంద్యము నేత్రములయందు మబ్బు అన్నద్వేషము అనువవిగలుగు. దానిసంబంధమువలన సర్వశరీరముపై నిప్పులు బోసినటులుండుట విసర్పివ్యాపించుచుండు స్థలమున నల్లగ నీలముగ యెఱ్ఱగనుండునదై త్వరితముగ వాపుగలుగుట అగ్ని దగ్ధంబైనటుల పైనబొబ్బలులేచి శీఘ్రముగతిగలదై కడుతీవ్రముగ హృదయమును కెందుటు లేక వాతము కడుబలిష్ఠంబగుట వలన శరీరమున వ్యథనుగలుగంజేయుట సంజ్ఞను నిద్రను నశింపంజేయుట శ్వాసమును వృద్ధిపరచుట యెక్కిళ్ళుగలుగుట భూమిమీదగాని లేక పడకమీదగాని గూర్చుండినను సుఖముగలుగకుండుట సంచారమువలన క్లేశముగలుగుట మనోదేహములకు క్లేశము వలనగలిగెడి దుర్బోధనిద్ర (అనగా మరణరూపకమైననిద్ర) ప్రాప్తంబగుట యీ లక్షణములుగలది అగ్నివిసర్పియని తెలియవలయు.

## క్షతవిసర్ప లక్షణము.

శ్లో॥ బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధ స్సరక్తం పిత్తమీరయన్ ।
విసర్పం మారుతఃకుర్యా త్కుళుత్థ సదృశై శ్చితమ్ ।
స్ఫోటైశ్శోథ జ్వరరుజా దాహాఢ్యంశ్యావశోణితమ్॥



తా. బాహ్య కారణమువలన గాయముగలిగిన దానివలన వాతము ప్రకోపించి రక్తసహిత పిత్తమును వ్రణమునందుజేర్చి విసర్పమును గలుగంజేయుట దానిపై ఉలవలతో సమానమైన శ్యామల వర్ణముగల కురుపులు వాపు గలుగుట జ్వరము వచ్చుట శూల దాహముగలుగుట రక్తము శ్యామలవర్ణముగనుండుట యీ లక్షణములుగలది క్షతజ విసర్పియని తెలియవలయు.

## విసర్పోపద్రవములు.

శ్లో॥ జ్వరాతిసారవమథు తృణ్మాంసదరణక్లమః ।
అరోచకావిపాకౌచ విసర్పాణాముపద్రవాః ॥

తా. జ్వరము అతిసారము వాంతి దప్పిగలుగుట మాంసము పగులుట అనాయాసముగ శ్రమ అరుచిగలుగుట అన్నము జీర్ణముగాకుండుట అనునవియు విసర్పిరోగోపద్రవంబులు.

## విసర్ప సాధ్యాసాధ్య లక్షణము.

శ్లో॥ సిధ్యంతి వాతకఫపిత్తకృతావిసర్పా స్సర్వాత్మకః క్షతకృతశ్చ
వసిద్ధిమేతి। పిత్తాత్మకోంజనవపుశ్చభవేదసాధ్యః।కృచ్ఛ్రాశ్చ
మర్మసుభవంతిహి సర్వఏవ ॥

తా. వాత పిత్త కఫములవలన గలిగిన విసర్పము సాధ్యము సన్నిపాత క్షతములవలన గలిగిన విసర్పము అసాధ్యము పిత్తమువలన గలిగిన విసర్పములో వొడలు నల్లగనగుటవలన నసాధ్యంబు. మర్మస్థానమున గలుగు సర్వవిసర్పులు కష్టసాధ్యంబులు.

శ్లో॥ [ఆయుర్వేదే] అంతర్బహిశ్చవిస్ఫోటై ర్విసర్పిస్స్యాద్విసర్ప
ణాత్ । సామాన్యంతస్యసంస్థానం సజ్వరశ్శోథదాహరుక్ ।
అంతఃకృచ్ఛ్రోబహిస్సాధ్యో దుశ్చికిత్స్యోస్య ద్వయాశ్రయమ్॥

తా. లోపల వెలుపల పొక్కులు వ్యాపించుటవలన విసర్పియనంబడు. దీనియందు జ్వరము వాపు దాహము వేదన గలిగియుండుట సామాన్యలక్షణము. లోన బుట్టిన విసర్పి కష్టసాధ్యము వెలిపట జనించిన విసర్పిసాధ్యము లోన వెలుపలజనించినది యసాధ్యము.

### విసర్పులకు కాలాగ్నిరుద్ర రసము.

శ్లో॥ [మాధవనిదానే] సూతకాంతాభ్రతీక్ష్ణానాం భస్మమాక్షిక
గంధకమ్ । వంధ్యాకర్కోటకీద్రావైస్తుల్యంమర్ద్యదినావధి।
వంధ్యా * కర్కోటకీకందే క్షిప్త్వాలేప్యం మృదాబహిః ।
భూధరాఖ్యే పుటేపాచ్యం దినైకంతద్విచూర్ణయేత్ । దశ
మాంశంవిషంయోజ్యం మాషమాత్రంతుభక్షయేత్। రసః
కాలాగ్నిరుద్రోఽయం దశాహేనవిసర్పనుత్। పిప్పలీమధుసం
యుక్తమనుపానం ప్రకల్పయేత్॥

తా. రసభస్మము కాంతభస్మము అభ్రకభస్మము వుక్కుభస్మము శుద్ధిజేసిన హేమమాక్షికము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గొడ్డు కాకరాకురసముతో 1 దినము మర్దించి ముద్దజేసి మధ్యమున ఛిద్రముజేయబడిన గొడ్డు కాకరగడ్డలోనునిచి దానిపై చీలమన్ను లేపనముజేసి యొకదినము భూధరపుటంబిడి సాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసి దానికి 10 వ భాగము శుద్ధిజేసిన నాభినిగలిపి మర్దించి మాషప్రమాణమును పిప్పలి తేనె అనుపాని యనుపానముతోడ 10 దినములు సేవించిన వాత విసర్పిహారించు.

### పిత్తవిసర్పికి ప్రపౌండరీకాది లేపనము.

శ్లో॥ [శారీరే] ప్రపౌండరీక మంజిష్ఠా పద్మకోశీరచందనైః ।
† మేషశృంగీశమం యష్టీ క్షీరమిశ్రంప్రలేపయేత్ ।
దినసప్తప్రయోగేణ విసర్పంపైత్తికంహరేత్॥

తా. అంతరదామర మంజిష్ఠి పుష్కరమూలము వట్టివేరు శ్రీగంధము కద్ది యష్టిమధుకము వీనిని సమభాగములుగ పాలతోనూరి 7 దినములు శరీరమున లేపనము జేసిన పిత్తవిసర్పి హారించు.

క॥ చందనమును జమ్మాకును । చందనమును గూడపాలసద్యో
ఘృతముల్ । పొంగించిత్రాగియలందిన । సందియమును లేదు
వే విసర్పులుమానున్॥

* కర్కోటికాయిష్టా వ్యక్తాప్యంలేప్యం మృదాబహిః॥
† సయష్టింవీరణైః పిత్తేష్టిగపిత్తైః ప్రలేపనమ్॥



### శ్లేష్మవిసర్పికి మదనాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] మదనంమధుకంనింబం వత్సకస్యఫలానిచ।
* అనేనవమనం దేయం విసర్పేకఫసంభవే।

తా. మరంగ యిప్ప వేము కొడిసెకాయ వీనిని సమముగ చూర్ణముజేసి వమనమున కొసంగిన శ్లేష్మ విసర్పులు హరించు.

### శ్లేష్మపిత్త విసర్పికి వారిసాగర రసము.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] శుద్ధసూతంవిషంగంధం మృతాభ్రం
టంకణంశిలామ్। ముసలీంహాయుమారంచప్రత్యేకంచవిమర్ద
యేత్ । ద్విగుంజాంభక్షయేన్నిత్యం శ్లేష్మపిత్తవిసర్పనుత్ ।
మరాలభాపర్పటీరం పటోలంకటుకీతథా। త్రిఫలాగుగ్గులూం
తుల్యంకషాయ మనుపాయయేత్ ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన గంధకము అభ్రకభస్మము వెలిగారము శుద్ధిచేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తాటిగడ్డల రసముతో 1 దినము గన్నేరురసముతో 1 దినముమర్దించి 2 గురిగింజలయెత్తును మరద గొండి పర్పాటకము చేదపొట్ల కాకర త్రిఫలములు శుద్ధిచేసిన గుగ్గిలము వీనిని సమ భాగములుగ దంచి కషాయముకాచి యీ యనుపానముతోడ సేవించిన శ్లేష్మపిత్త విసర్పులు హరించు.

### శ్లేష్మవాత విసర్పికి చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] సూతంగంధందగ్ధశంఖం మాక్షికంచశిలా
జతు । ద్వినిశాచామృతాచైవ తుల్యాంశంనీలికారసైః ।
మర్ద్యాజ్యాభ్యాంసహాపేష్యం విసర్పే లేపయేత్తథా। దేయః
కాలాగ్నిరుద్రోఽత్ర రసోగుంజాద్వయంహితమ్ । పటోలత్రి
ఫలానింబంమధునా లేహయేదను ॥

తా. రసము గంధకము కాల్చినశంఖము హేమమాక్షికము శిలాజిత్తు పసుపు మానిపసుపు తిప్పతీగె వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నీలిచెట్టు

* వమనంచ విధాతవ్యం విసర్పేకఫపిత్తజే.

రసము తేనె నెయ్యి అనుపానితో మర్దించి విసర్పియందు లేపము చేయుటయేగాక 2 గురిగింజలయెత్తు కాలాగ్నిరుద్రరసమును చేతిపొట్లవిత్తులు త్రిఫలములు వేపచిగుళ్లు వీనిని తేనెతోనూరి యీ యనుపానముతోడ సేవించిన శ్లేష్మవాత విసర్పులు హరించు.

వాతపిత్తవిసర్పికి గుళూచ్యాది లేపము.

శ్లో॥ [ఆయుర్వేదే] గుళూచీపిచుమందాంబు బదరేంద్రయవాం
బుదాః। విస్ఫోటంనాశయంత్యాశు వాయుపిత్త విసర్పకమ్॥

తా. తిప్పతీగ వేము కురువేరు రేగు కొడిసెపాల తుంగముస్తెలు వీనిని సమభాగములుగ నూరి లేపనముచేసిన విస్ఫోటకము వాత పిత్త విసర్పులు హరించు.

విసర్పమునకు శోభాంజనాది లేపము.

శ్లో॥ శోభాంజనంగంధమూలం లవణంకాంజికైస్సహ।
లేపాత్సన్నయుగతంహంతి విసర్పమతి దుస్సహమ్॥

తా. మునగచెక్క కురువేరు ఉప్పు వీనిని కలితోనూరి శరీరమున లేపనము చేసిన కడుదుస్సహమైన స్నాయుగత విసర్పిని హరింపజేయు.

సన్నిపాత విసర్పమునకు చికిత్స.

శ్లో॥ రసఃకాలాగ్నిరుద్రోత్ర మధుమాగధిమిశ్రితమ్।
పటోలనింబవాసాశ్చ సప్తపర్ణి ఫలత్రికమ్।
గుళూచీకటుకీముస్తా ఏభిస్సం పాచయేద్ఘృతమ్॥
పానాచ్చలేపనాద్ధంతి వచిస్ఫోటం విసర్పకమ్॥

తా. కాలాగ్నిరుద్రరసమును తేనె పిప్పలితో సేవించినను లేక చేతిపొట్ల వేము అడ్డసరము యేడాకులపాలచెక్క త్రిఫలములు తిప్పతీగ కాకర తుంగముస్తెలు అను వానిని సమభాగములుగదంచి చూర్ణముచేసి నేతిలోగలిపివండి సేవన లేపనముల చేయుచుండినను బొబ్బలతో గూడియుండు విసర్పి హరించు. (శ్రీగంధము చందనపుమారు గూడపాలగంధము జమ్మిరాకురసము ఆవునెయ్యి వీనిని సమముగ గలిపి అందు సగమును పానముచేసి తక్కిన సగమును శరీరమున లేపనముచేసిన సర్వవిసర్పులు హరించు.

విసర్పోపచార క్రమము.

శ్లో॥ [అశ్వినినిఘంటౌ] తత్రవైరోధనంశస్తం తథాశోణితమోక్ష



ణమ్।ప్రశస్తం సర్వవిసర్పా పర్ణీనాంవా చతుష్టయమ్।బలా
త్రయం వాసఘృతం పానలేపనసేచనైః॥

తా. పైజెప్పబడిన సర్వవిసర్పులయందు వమన విరేచనములు రక్తస్రావము చేయించుట ప్రశస్తము మరియు కోలపొన్న ముయ్యాకుపొన్న కారుపెసలు కారు మినుములు వీనిని సమముగ కషాయముకాచి అందావునెయ్యి గలిపిగాని లేక * బలాత్రయమును కషాయముకాచి అందుఆవునెయ్యి గలిపిగాని సేవన లేపన సేచనముల జేయుచుండిన సర్వవిసర్పులు హరించు.

శ్లో॥ పక్వేతు వ్రణనిర్దిష్టాం చికిత్సాంకారయేద్భిషక్॥

తా. విసర్పులు పక్వంబులైన వైద్యుడు వ్రణచికిత్సం జేయవలయు.

ప్రపున్నాటాది లేపనము.

శ్లో॥ ప్రపున్నాటబీజంనిశా నింబపత్రంనవంవై కపాలాంతస్థైవాథ
యాచ। స్నుహీపత్రతోయేన పిష్ట్వాప్రలేపః క్షణాద్దేహద
ద్రూన్ విసర్పాపహంతా॥

తా. తగిరిసెవిత్తులు పసపు వేపాకు క్రొత్తచిల్లపెంకులు కరక్కాయలు వీనిని జెముడాకురసముతో నూరి (పటుదామెరపైన) మంగలకత్తితో గీచి లేపనము చేసిన పటుదామెర దద్రువు విసర్పులు తక్షణమున హరించు.

(శొంఠి మిరియాలు నల్లేరువేరు తెల్లనువ్వులు ఆవాలు తగిరిసెవిత్తులు వోమము వెల్లుల్లి పంచదార వీనిని సమభాగములుగ నుదకముతోనూరి పటుదామెరను రేగగోకి దానిపై లేపనముచేసినను లేక నాగముల్లెవేరును నిమ్మపండ్లరసముతో గంధముదీసి లేపనము చేసినను లేక పటుదామెరను మంగలకత్తితో రేగగోకి పీట్లవేరును కలితో గంధము దీసి లేపనముచేసినను లేక రేలకొనలు వెల్లుల్లి చిన్నంగివేరు కరక్కాయ మైలుతుత్తము వీనిని నిమ్మపండ్లరసముతో గంధముదీసి పటుదామెరను రేగగోకి లేపనముచేసినను లేక ¼ యెత్తు తగిరిసెవిత్తులను ¼ యెత్తు కరకపప్పును నీరుకలియని 1 సేరు బర్రెపాలలో 8 దినములు నానబెట్టి యందు ¼ తులము మణిశిల ¼ యెత్తు బెల్లము గలిపి బాగుగనూరి రేగగోకిన పటుదామెరపై లేపనముచేసినను పటుదామెరమానును. ఈ క్రియల నొకమండలమువరకు చేయవలయు.

* బలాత్రయమన—ముత్తవపులగము పెదముత్తవపులగము నాగబలయనునవి.

### విసర్పమునందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పురాణయవగోధూమ కంగుషష్టిక శాల
యః॥ముద్గామసూరాశ్చణకా స్తువర్యో జాంగలోరసః। నవ
నీతం ఘృతంద్రాక్షా దాడిమం కారవేల్లకమ్। వేత్రాగ్రంకు
లకంధాత్రీ ఖదిరోనాగకేసరః॥ద్రాక్షాశిరీషకర్పూరం చంద
నంతిలలేపనమ్। యథాదోషంపథ్యమిదంసేవితవ్యంవిసర్పిభిః॥

తా. ప్రాతయవలు గోధుమలు కొఱ్ఱలు 60 దినములకు ఫలించెడివడ్లు పెసలు చిరుసెనగలు సెనగలు కందులు జాంగలమాంసరసము వెన్న నెయ్యి ద్రాక్షపండు దాడిమపండు కాకరకాయ పెదురుగొమ్ము చిట్టిరుమికిఱాక వుసిరికపండు చంద్ర నాగకేసరములు ద్రాక్ష దిరిసెనము కర్పూరము చందనము నువ్వులు అనువాని లేపనము దోషానుగుణ్యముగ విసర్పిరోగమునందు పథ్యకరంబులు.

### విసర్పమునందపథ్యము.

శ్లో॥ వ్యాయామమహ్నిశయనం సురతంప్రవాతం క్రోధం శుచం
వమనవేగవిధారణంచ।గుర్వన్నపానముభలంలశునంకుళుత్థా
మాషాం స్తిలా సకలమాంసమజాంగలంచ।స్వేదంవిదాహి
లవణామ్లకటూనిమద్యమర్క ప్రభామపివిసర్పగదీత్యజేత్తత్।

తా. సంచారము పగలునిద్ర మైథునము గాలి క్రోదము దుఃఖము వమన మల మూత్రవేగధారణము జడాన్నము జడకరమైనపానము వెల్లుల్లి వులవలు మినుములు నువ్వులు అరణ్యమునందలి సర్వజంతుమాంసము చెమటవేయుట విదాహకర ద్రవ్యములు వుప్పు పులుపు కారము మద్యము యెండ వీనిని విసర్పరోగము గలవారు వర్జింపవలయు.

సీ॥ వాయువిడంగ లవంగము లేలకుల్ జాపత్రికాచును బాజికా
య।ప్రాంతికొ బ్బెర కదుఁబ్రాంతబెల్లంబును బోఁకలుత్రికటం
బువోమపొట్టు। పిప్పలిమూలంబు వెసజీడిగింజలు గుజ్జుతైన
యట్టియాకొడిసెపాలు । యిన్నియు సమకూర్చి యిన్నియు
సమభాగములుగూర్చి త్రొక్కియుఁ బొసఁగమాత్ర।



లమరఁజేసియుగుండలం బవనియందు। శ్వేతరోగంపుమను
జులు సేవఁజేసి। వరఁగఁబథ్యంబుగుండినఁ బాటిపోవు। ప్రళ
యమేఘునివాయువు తొలచునట్లు॥

### విస్ఫోటక నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] కట్వమ్లతీక్ష్ణోష్ణ విదాహరూక్ష క్షారైరజీ
ర్ణాధ్యశనాతిపైశ్చ। తథర్తుదోషేణవిపర్యయేణకుప్యంతిదో
షాఃపవనాదయస్తు। త్వచమాశ్రిత్యతేరక్త మాంసాస్థీని ప్ర
దూష్యచ। ఘోరాన్కుర్వంతివిస్ఫోటాన్ సర్వాన్జ్వరపు
రస్సరాన్॥

తా. కారము పులుసు తీక్ష్ణము వుష్ణము విదాహము రూక్ష క్షారముగల రసముల సేవించుటవలనగాని లేక అజీర్ణము వలన గాని లేక అధికముగ భుజించుట వలన గాని యెండ ఋతువిపర్యయ దోషము అనువాని వలనగాని వాతాదిదోషములు దుష్టంబులై చర్మము నాశ్రయించి రక్తమాంస అస్థులంజెడచి కడుభయంకరమైన కురుపుల గలుగంజేసిన విస్ఫోటక మనంబడు. దానియందు జ్వరము గలిగియుండు. (సర్వవిస్ఫోటకములకు రక్తపిత్తములే ముఖ్య కారణంబులు.)

### విస్ఫోటక స్వరూపము.

శ్లో॥ అగ్నిదగ్ధనిభాస్ఫోటా స్సజ్వరారక్తపిత్తజాః॥
క్వచిత్సర్వత్రవాదేహే విస్ఫోటాఇతితేస్మృతాః॥

తా. రక్తపిత్తములవలన గలిగిన సర్వ విస్ఫోటకములయందు తొలుత జ్వరము గలిగి అగ్నివలన గాల్చబడినట్టి కాంతిగల విస్ఫోటకములు శరీరము యొక్క నొకప్రదేశమునందు గాని లేక సర్వశరీరమునందుగాని జనించు. దీనినే విస్ఫోటక మనియెదరు.

### వాతవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ శిరోరుక్శూలభూయిష్ఠం జ్వరతృట్పర్వభేదనమ్।
సకృష్ణవర్ణతాచేతి వాతవిస్ఫోటలక్షణమ్।

తా. కపాలము నొచ్చుట కురుపులయందు కడుశూలగలుగుట జ్వరము దప్పి గలుగుట సంధులు పగిలినటుల నొచ్చుట కురుపులు నల్లగనుండుట యీ లక్షణములు గలది వాతవిస్ఫోటకమని తెలియవలయు.

పిత్తవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ జ్వరదాహరుజాస్రావ పాకతృష్ణాభిరన్వితమ్।
పీతలోహితవర్ణంచ పిత్తవిస్ఫోటలక్షణమ్॥

తా. జ్వరము దాహము పోట్లు స్రావము పాకము దప్పి గలుగుట పచ్చగ గాని లేక యెఱ్ఱగాని యుండుట యీ లక్షణములు గలది పిత్తవిస్ఫోటకమని దెలియవలయు.

కఫవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ ఛర్ద్యరోచకజాడ్యాని కండూకాఠిన్యపాండుతాః।
అవేదనశ్చిరాత్పాకీ సవిస్ఫోటః కఫాత్మకః॥

తా. వాంతి అరుచి జడత్వము దురద కాఠిన్యము గలుగుట తెల్లగ నుండుట అల్పవేదన చిరకాలము మీద పాకము యీ లక్షణములు గలది విస్ఫోటక మని తెలియ వలయు.

కఫపిత్త విస్ఫోటక లక్షణము.

శ్లో॥ కండూర్దాహోజ్వరశ్ఛర్దిరేతైస్తు కఫపైత్తికః।

తా. దురద దాహము జ్వరము వాంతి గలిగిన కఫపిత్త విస్ఫోటక మని తెలియవలయు.

వాతపిత్త విస్ఫోటక లక్షణము.

శ్లో॥ వాతపిత్తకృతోయస్తు కురుతే తీవ్రవేదనామ్॥

తా. మిక్కుటముగ పోట్లు గలిగిన వాతపిత్త విస్ఫోటకమని దెలియవలయు

కఫవాత విస్ఫోటక లక్షణము.

శ్లో॥ కండూస్తైమిత్యగురుభిర్జానీయాత్కఫవాతికమ్।

తా. దురద స్తబ్ధత్వము జడత్వము గలిగి వాతకఫ విస్ఫోటక మని దెలియవలయు.



సన్నిపాత విస్ఫోటక లక్షణము.

శ్లో॥ మధ్యేనిమ్నోన్నతోంతేచ కఠినోల్పప్రపాకవాన్।
దాహరాగతృషామోహ ఛర్దిర్మూర్ఛారుజోజ్వరః॥
ప్రలాపోవేపథుస్తంద్రా సోసాధ్యశ్చత్రిదోషజః॥

తా. మధ్యప్రదేశము పల్లముగ చుట్టూ మిట్టగ కఠినముగ గాని లేక యొకింత పండినట్టుగగాని నుండిన త్రిదోషజ విస్ఫోటక మని దెలియవలయు. దాని సంబంధమూ వలన దాహము దొల్లిగారుట దప్పి మోహము వోకర మూర్ఛ పోట్లు జ్వరము తలుచుమాటలు కంపము మబ్బు అను నవి గలుగు. ఈ విస్ఫోటకం బసాధ్యము.

రక్తజ విస్ఫోటక లక్షణము.

శ్లో॥ రక్తారక్తసముత్థానా గుంజాఫలనిభాస్తథా।
వేదితవ్యాస్తురక్తేన పైత్తికేనచహేతునా।
నతేసిద్ధిం సమాయాంతి సిద్ధైర్యోగశతైరపి॥

తా. గురిగింజవలె నెఱ్ఱనై పిత్తదోషయుక్తంబై రక్తదూష్యంబై యుండునది రక్తజ విస్ఫోటకమని దెలియవలయు. దీనియందనేకోపచారములం జేసినను సాధ్యంబు గాకుండు.

విస్ఫోటక సాధ్యాసాధ్య లక్షణములు.

శ్లో॥ ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యోద్విదోషజః।
సర్వరూపాన్వితోఘోరస్త్వసాధ్యోభూర్యుపద్రవః॥

తా. ఏకదోష విస్ఫోటకము సాధ్యము. ద్విదోషజ విస్ఫోటకము కష్టసాధ్యము. త్రిదోషజనితంబై యనేకోపద్రవయుక్తంబై భయంకరముగ నుండు విస్ఫోటక మసాధ్యము.

విస్ఫోట కోపద్రవములు.

శ్లో॥ హిక్కాశ్వాసారుచిస్తృష్ణా * చాంగసాదోహృదివ్యథా।
విసర్పజ్వరహృల్లాసా విస్ఫోటానాముపద్రవాః॥

* చాంగమర్దో.

తా. ఎక్కువగ పుట్టుకయు అరుచి దప్పి వాడలు కృశించుట లోమ్ము నొప్పి విసర్పము జ్వరము నోటకారముగ నీళ్ళూరుట యివి విస్ఫోట కోపద్రవములని దెలియవలయు.

విస్ఫోటకమునందు సామాన్యోపచారము

శ్లో॥ [ఆయుర్వేదే] తత్రాదౌలంఘనంకార్యం వమనంపథ్యభోజ
నమ్ । యథాదోషంబలంవీక్ష్యప్రోక్తంయుక్తంచరేచనమ్ ॥

తా. విస్ఫోటకమున తొలుత లంఘనము చేయించి పిదప వమనము కొసంగి పథ్యకరమైన భోజనముల భుజింప జేయవలయు. మఱియు విస్ఫోటక దోషబలము నెఱింగి యథాయోగ్యముగ విరేచనము చేయించవలయు

ద్విపంచమూలాది కషాయము.

శ్లో॥ ద్విపంచమూలంరాస్నాచ దార్వ్యుశీరందురాలభామ్।
సామృతంధాన్యకంముస్తాం క్వాథయిత్వాశృతంపిబేత్।
విస్ఫోటంవాతసంభూతం హంత్యేతన్నాత్రసంశయః॥

తా. దశమూలములు సన్నరాస్నము మ్రానిపసుపు వట్టివేరు దురదగొండి తిప్ప తీగె ధనియాలు తుంగముస్తెలు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి త్రాగిన వాతవిస్ఫోటకము నిస్సంశయముగ హరించు.

ద్రాక్షాది కషాయము.

శ్లో॥ ద్రాక్షాకాశ్మర్యఖర్జూర పటోలారిష్టవాసకైః।
లాజాకులకమస్సపర్ణైః క్వాథశ్శర్కరయాయుతః ।
విస్ఫోటంపిత్తజంహంతి సోపద్రవమసంశయమ్॥

తా. ద్రాక్ష గుమ్ముడు ఖర్జూరము చేదిపొట్ల వేప అడ్డసరము పేలాలు చిట్టాముదము దురదగొండి వీనిని కషాయము కాచి అందు శర్కర గలిపి త్రాగిన ఉపద్రవములతో గూడియుండు పిత్త విస్ఫోటకము నిశ్చయముగ హరించు.

భూనింబాది కషాయము.

శ్లో॥ భూనింబనింబయాసాశ్చ త్రిఫలేంద్రవవాసకాః ।
పిచుమందఃపటోలీచ క్వాథమేషాంసశర్కరమ్॥



పీత్వావిముచ్యతేనూనం కఫవిస్ఫోటకాన్నరః ।

తా. నేలవేము వేము దురదగొండి త్రిఫలములు కొడిసెపాలవిత్తులు అడ్డసరము కటునింబ చేదిపొట్ల వీనిని కషాయముకాచి అందు పంచదారగలిపి త్రాగిన కఫ విస్ఫోటకము హరించు.

ద్వాదశాంగ కషాయము

శ్లో॥ కిరాతతిక్తకారిష్ట యష్ట్యాహ్వాంబుదపర్పటైః ।
పటోలవాసకోశీర త్రిఫలాకౌటజైశ్శృతమ్।
ద్వాదశాంగంనరఃపీత్వా విస్ఫోటేభ్యోవిముచ్యతే ।
ద్వంద్వజేభ్యస్త్రిదోషోత్థ రక్తజేభ్యోహితాశనః ।

తా. నేలవేము వేము అతిమధురము తుంగముస్తెలు పర్పాటకము చేదిపొట్ల అడ్డసరము వట్టివేరు త్రిఫలములు కొడిసెపాలవిత్తులు వీనిని కషాయముకాచి త్రాగిన ద్వంద్వ త్రిదోష రక్తదోషములవలన గలిగిన విస్ఫోటకము హరించు మఱియు దీని యందు లఘుకరముగనుండు పదార్థముల సేవించుట పథ్యకరము.

అమృతాది కషాయము.

శ్లో॥ అమృతవృష పటోలంముస్తకం సప్తపర్ణంఖదిర ససితవేత్రం
నింబపత్రంహరిద్రే । శృతమితిసవిసర్పాన్ కుష్ఠవిస్ఫోటకం
దూరపనయతిమసూరిం శీతపిత్తజ్వరంచ॥

తా. తిప్పతీగె అడ్డసరము చేదిపొట్ల తుంగముస్తెలు యేడాకులరటి చంద్ర కెంగుగొమ్ము కేపాకు పసుపు మ్రానిపసుపు వీనిని కషాయముకాచి పంచదార గలిపి త్రాగిన విసర్పి కుష్ఠువు విస్ఫోటకము దురద మసూరిక పిత్తజ్వరము హరించు.

పటోలాది కషాయము.

శ్లో॥ పటోలామృత భూనింబవాసారిష్టకపర్పటైః ।
ఖదిరాష్టయుక్తైః క్వాథోవిస్ఫోటజ్వరశాంతయే॥

తా. చేదిపొట్ల తిప్పతీగె నేలవేము అడ్డసరము వేము పర్పాటకము ఖదిరాష్టకము వీనిని కషాయముకాచి త్రాగిన విస్ఫోటకము జ్వరము హరించు. (ఖదిరాష్టకమన—చంద్ర త్రిఫలములు చేదిపొట్ల తిప్పతీగె అడ్డసరము వేము అనునవి.)

### విస్ఫోటకములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] విస్ఫోటకే హితార్థాయ సేవయేచ్ఛయవా
దిభిః। ముద్గాఢకీ మసూరాణాం రసైర్వ్యాధిశ్వసంయుతైః।
సునిషణ్ణక వేత్రాగ్రం తండులీయకటిల్లకైః। కులకాఖీరకై
రేఖిస్సపర్పటసతీన్నకైః॥ తిక్తయూషసమాయుక్తైః రోగ్యభోజనం
సంప్రయోజయేత్॥

తా. యవలు పెసలు కందులు చిరుసెనగలు వీని కట్టులో శొంఠిమార్ణమున గలిపిగాని చెంచలికూర పెదుగుగొమ్మ చిత్తికూర కాకరకాయ చిట్టిముల్లంగి పిల్లి తీగర పర్పాటకము లంకలవెల వల్లు చేదుగలయూషము అనుపానినిగాని విసర్పి రోగములందు భుజించుట పథ్యకరము.

### విస్ఫోటకములయందపథ్యము.

శ్లో॥ తిలాన్మాషాన్ కుళుత్థాంశ్చలవణామ్లకటూనిచ।
విదాహిమూతుమన్నంచవిస్ఫోటీపరివర్జయేత్॥

తా. నువ్వులు వుద్దులు వులవలు వుప్పు పులుసు కారము దాహకర పదార్థములు రాత్రి వున్నము వీనిని విస్ఫోటకరోగములవారు వర్జింపవలయును.

ఇతి శ్రీనీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ సిద్ధి
మామిడి భగిసత్సంప్రదాయ శారాధ్య రామదేశిక శిష్యోత్తమ పమళ్ళ
వాయి సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజనశిరో
భూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ ప్రణీత
శ్రీబసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే కుష్ఠ
విసర్పి విస్ఫోటక రోగ నిదాన తత్సాధ్యా
సాధ్య చికిత్సానుపాన పథ్యాపథ్య
లక్షణయుక్తం త్రయోదశ
ప్రకరణమ్.

---

శ్రీ రస్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

## చతుర్దశ ప్రకరణము.

శ్లో॥ శ్రీజంగమేశ పాదాబ్జ భృంగం శుద్ధం మహేశ్వరమ్।
సర్వజ్ఞం సకలాధారం బసవేశ మహంభజే॥

తా. జంగమేశ్వరుని పాదపద్మముల సేవించువాడు శుద్ధుడు మహేశ్వరుడు సర్వజ్ఞుడు సకల జగత్తున కాధారభూతుడు నగు బసవేశ్వరుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః।
వక్ష్యామి వృషరాజీయ మహావైద్య శిఖామణిమ్॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథము యొక్క చతుర్దశ ప్రకరణమును రచింపుచున్నాడను.

### అర్శోరోగ స్వరూపము.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] అర్శాంసిశుక జిహ్వాశ్చకర్క
టం జలుక స్తథా। ప్లక్షోదుంబర సంకాశాన్యేతాన్యర్శాం
సిషంచచ॥

తా. కొన్నిమూలరోగములు చిలుకనాలుక కోడిజుట్టు జలగ జువ్వికాయ మేడికాయ అనువానితో తుల్యముగనుండును. ఇటుల మూలరోగంబులు ౬ విధంబులు.

శ్లో॥ బింబీకర్కంధుఖర్జూర కార్పాసీఫలసన్నిభాః।
కేచిత్కదంబపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః।
బహుస్రావీశోష్ఠ జిహ్వాశంబూ కావర్తతుల్యాభమ్।
భేషజక్షారశస్త్రాగ్ని * సాధ్యానాంచప్రశస్యతే॥

* సాధ్యత్వం యాప్యముచ్యతే.

తా. మఱియు మూలరోగములు దొండపండు రేగుపండు ఖర్జూరకాయ ప్రత్తికాయ అనువానితో తుల్యములుగ కొన్ని కదిమిపువ్వులతో తుల్యములుగ మఱి కొన్ని యావాలతో తుల్యములుగ రొల్లపుడు ప్రాకములగలవిగ ఒంటె నాలుకతో సమానములుగ నత్తగుల్లతో సమానమైన రూపములు గలవిగనుండును. అందు సాధ్యంబులుగనుండు అర్శోరోగముల కౌషధ క్షార శస్త్రాగ్నికర్మలవలన చికిత్సింపవలయును.

శస్త్రోపయుక్త యంత్ర లక్షణము.

శ్లో॥ బాలానాంగోస్తనాకారం యంత్రకంచతురంగుళమ్।
సహిపంచాంగుళం పుంసాం ప్రమదానాంషడంగుళమ్।
ద్విచ్ఛిద్రమర్శసాం వేధే స్యేకచ్ఛిద్రంతుకర్మణి।
అధస్త్ర్యంగుళం ఛిద్రమంగుష్ఠోదరవిస్తృతమ్॥

తా. మూలరోగోపయుక్తయంత్రము గోస్తనాకారముగలదై పట్టికొనుటకు క్రిందిభాగమున మూడంగుళముల పొడవు అంగుష్ఠోదర ప్రమాణమైన వెడల్పుగలదై 2 ఛిద్రములుగలదిగ నుండవలయును మఱియు అంగుళముల పొడవుగల యంత్రముతో బాలురకును 5 అంగుళముల పొడవుగల దానితో పురుషులకును 6 అంగుళముల పొడవుగల దానితో స్త్రీలకును చికిత్సింపవలయును. మఱియు 2 ఛిద్రములుగల యంత్రమును మూలరోగమును వేధించుటకును 1 ఛిద్రముగల దానిని శస్త్రకర్మయందును నుపయోగింపందగు

అర్శోరోగ సామాన్య గుణములు.

శ్లో॥ అరోచకాగ్నిమాంద్యంచ హ్యాంత్రకూజనమేవచ। గుల్మం
ప్లీహాంచశ్వయథుశ్శ్రోత్రే కర్ణధ్వనిర్భ్రమః। అష్ఠీలకముదా
వర్తో మలబాధస్తథైవచ। కట్యూరువంక్షణే శూలంజ్వరమ
న్నేచద్వేషితా। శోషావివర్ణతాదేహే హ్యర్శసాం లక్ష
ణానిదుః॥

తా. అరుచి అగ్నిమాంద్యము ప్రేగులఱచుట గుల్మము ప్లీహము శ్రోత్రముల యందు వాపు చెవిలో ధ్వనిగలుగుట కొదలు దిరుగుట అష్ఠీలికారోగము ఉదావర్తము గలుగుట మలము బద్ధగించుట నడుము తొడలు గజ్జలు అనువానియందు శూలగలుగుట జ్వరము అన్నద్వేషము శోష శరీరవైవర్ణ్యముగలుగుట ఇవియు మూలరోగముగ సామాన్యలక్షణంబులు.



అర్శోరోగ భేదములు.

శ్లో॥ [మాధవనిదానే] అర్శాంసిషట్ప్రకారాణి రక్తదోషాత్త్రి
దోషతః। జాయంతేమారుతాత్పిత్తాత్కఫాద్ద్వంద్వాద్ద్వశి
త్రయే॥

తా. రక్తార్శస్సు త్రిదోషార్శస్సు వాతార్శస్సు పిత్తార్శస్సు శ్లేష్మార్శస్సు ద్వంద్వార్శస్సు అని మూలరోగములు 6 విధంబులు.

అర్శోరోగ సాధ్యాసాధ్యములు.

శ్లో॥ ఏకదోషోత్థితంబాహ్యం సుఖసాధ్యం తథాచిరాత్।
ద్వంద్వజంయాప్యకంచైవ కృచ్ఛ్రసాధ్యం భిషగ్వరైః॥
అంతర్వత్తి త్రిదోషోత్థాన్యసాధ్యార్శాంసితానిచ।
కుర్వంతిసర్వరోగాంశ్చ తస్మాద్యత్నేన తజ్జయేత్॥

తా. మూలరోగము ఏకదోషమువలనగాని లేక వెలుపటివళియందుగాని జనించియుండినను మఱియు జనించి చిరకాలము గాక యుండినను సుఖసాధ్యంబు. ద్వంద్వదోషములవలన జనించిన మూలరోగము కష్టసాధ్యంబగుటచే యాప్యంబు. అంతర్వళియందు జనించిన మూలరోగంబును త్రిదోషములవలన జనించిన మూలరోగంబును అసాధ్యంబులు. మఱియు మూలరోగము సర్వరోగోత్పత్తికి కారణంబగుటచే దానిని సర్వప్రయత్నములవలన మాన్పంజేయవలయును.

అర్శోరోగ పూర్వరూపము.

శ్లో॥ విష్టంభోజఠరాటోప శ్శార్శ్యసిగ్రహణీతథా।
కార్శ్యముద్గారబాహుళ్యం పూర్వలక్షణముచ్యతే॥

తా. అన్నము జీర్ణముగాకుండుట కడుపులో గుడగుడశబ్దముగలుగుట గ్రహణీరోగముగలుగుట శరీరము కృశించుట మిక్కుటముగ త్రేకరింతలు గలుగుట ఇవియు అర్శోరోగ పూర్వలక్షణంబులు.

వాతార్శస్సునకు కారణము.

శ్లో॥ కటుతిక్తకషాయైశ్చ రూక్షశీతాతిశీతలైః॥
భోజనైర్లంఘనైర్వాపి మద్యమైథునసేవనైః॥
జాయంతేహ్యంకురైశ్శ్యామై శ్శుష్కార్శాంసిచమారుతాత్॥

తా. కారము చేదు వగరు రూక్ష తీక్ష్ణము కడుశీతలముగల పదార్థముల భుజించుట ఉపవాసముచేయుట మిక్కుటముగ మద్యపానము స్త్రీసంభోగముచేయుట యీ కారణములవలన నల్లనై రూక్షమైన మొలకలతో గూడియుండు వాతార్శస్సుజనించు.

వాతార్శస్సు లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] బింబసర్షపకార్పాసబీజవత్స్ఫుటితాననః।
నశబ్దధూమసంయుక్తం స్తోకంచాధఃప్రవాహికా।
విష్టంభదాహశూలం నానారోగాశ్చమారుతాత్।

తా. మొలకలు దొండపండు ఆవాలు ప్రత్తిగింజ అనువానితో సమానంబై పగిలియుండుట గుదమున శబ్దముగలుగుట పొగవెడలుచుండుట పలుమారు కొంచ కొంచముగ విరేచనములగుట మలము బద్ధగించుట మంటలు శూల పలువిధ రోగములు గలుగుట యీ లక్షణములు గలది వాతార్శస్సని దెలియవలయు.

వాతార్శ కారణ లక్షణములు.

శ్లో॥ [చరకే] కట్వమ్లలవణోష్ణాని వ్యాయామాగ్న్యాతపశ్రమాః।
సేవనాత్పిత్తతేరక్తం నీలపీతోష్ణవర్చసః।
రక్తాసీలాస్సితాః పీతా మృదవశ్చాంకురాస్తథా।
దాహపాకజ్వరస్వేద తృణ్మూర్ఛాః పిత్తజార్శసామ్।

తా. కారము పులుసు ఉప్పు ఉష్ణము వ్యాయామము అగ్ని యెండ శ్రమ అనువానిసేవనవలన రక్తముగారుట మలము నల్లగ పచ్చగ ఉష్ణముగ వెడలుట యెఱ్ఱగ నల్లగ తెల్లగ పచ్చగ మృదువుగనుండు మొలకలు జనించుట మంట పాకము జ్వరము చెమట దప్పి మూర్ఛ కలుగుట యీ లక్షణములుగలది పిత్తార్శస్సని తెలియవలయు.

శ్లేష్మార్శ నిదాన లక్షణములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] అతిశీతగురుస్నిగ్ధ క్షారామ్లన్యనిషేవణాత్।
శ్లేష్మాల్బణాగ్నిరంశుభ్రం పిత్తార్శోగోస్తనినమ్।
స్పర్శేః కండ్వాః ప్రియంస్నిగ్ధం నానారోగకరం కిల।
వసాభవకఫప్రాయః పురీషాస్రప్రవాహికా॥
శ్లేష్మాశ్లేష్మార్శసాహ్యేషాం రక్తమోక్షాత్సుఖావహమ్।



శ్లేష్మార్శసాంగుదేపార్శ్వే రక్తమోక్షం జలూకయా।
కృత్వాచార్కరసైః శ్లేష్యాం దాహశ్చాత్రాపిశస్యతే।

తా. కడుశీతలము జడము స్నిగ్ధము క్షారము పులుసుగల పదార్థముల సేవించుటవలన శ్లేష్మము ప్రకోపించి కఠినముగ తెల్లగ పచ్చగ గోస్తనాకారముగ నుండు మొలకల గలుగఁజేయుట కాకిన నవకమించుట మెఱయుచుండుట పలువిధ రోగములకు కారణంబుగనుండుట మలము మాంసపుగ్రోవ్వుతో సమానముగ అనుయుక్తముగ నీటితో సమానముగ వెడలుట యీ లక్షణములు గలది శ్లేష్మార్శస్సని దెలియవలయు దీనియందు రక్తస్రావమును జేయించుట సుఖకరము. మఱియు దీనియందు గుదపార్శ్వమున జలగలతో రక్తస్రావమును జేయించుటయే గాక జిల్లేడుపాల లేపనమును దాహకర్మను సగాజేయుట ప్రశస్తంబు.

అర్శోభేద లలితము.

శ్లో॥ [పూజ్యపాదీయే] గుదద్వారాత్పృష్ఠదేశే జాయంతే పాం
డురాంకురాః। లలితాసేతిశుష్యంతే మూలరోగస్య లక్షణ
మ్। శ్లేష్మార్శసామయం భేదో హాన్యల్లేపరసాయనైః॥

తా. గుదమునకు పైభాగమున పాండువైన తెల్లని మొలకలు జనించి శుష్కించు. ఇదియు మూలరోగ లక్షణము ఇది శ్లేష్మార్శస్సులో భేదముగలదిగ నుండు. దీనిని లేపనరసాయనములచే హరింపఁ జేయవలయు.

ద్వంద్వ త్రిదోషార్శో లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మిశ్రితేద్వంద్వజంజ్ఞేయం సర్వరూపంత్రి
దోషజమ్। నస్రవం తేనభిద్యంతే స్నిగ్ధపాండుత్వగాదయః॥

తా. 2 దోషలక్షణములు గలది ద్వంద్వజార్శస్సనియు వాత పిత్త శ్లేష్మలక్షణయుక్తంబై స్రావభేదనరహితంబై చర్మాదులు మెఱయుచు పాండురవర్ణముగ నుండిన త్రిదోషార్శస్సనియు తెలియవలయు.

రక్తార్శో లక్షణము.

శ్లో॥ [భేషజకల్పే] రక్తోల్బణాగుదేకీలాః పిత్తాకృతిసమన్వితాః।
శృంగాత్యైశోణితస్రావో హ్యధోవాయుర్నగచ్ఛతి।

వాతపిత్తకఫాహ్యత్ర ద్వంద్వజాశ్చ త్రిదోషజాః ।
లక్షణైః పూర్వవజ్జ్ఞాత్వా చికిత్సాచ్ఛోణితార్శసామ్ ।

తా. గుదమున రక్తము స్రవించుట మొలకలు పిత్తార్శలక్షణ యుక్తంబులుగ నుండుట వాతము అధోముఖముగ సంచరింపకుండుట పూర్వోక్త వాత పిత్త శ్లేష్మ ద్వంద్వ త్రిదోషలక్షణయుక్తంబుగనుండుట ఈ లక్షణములుగలది రక్తార్శస్సని తెలియవలయు. దీనియందు కొమ్ములు సారకాయలబుడ్డలు మొలలకు వానిచే రక్తస్రావమును జేయించుటయేగాక వాత పిత్త శ్లేష్మ ద్వంద్వ త్రిదోషార్శ చికిత్సలను సగా జేయవలయు.

## అర్శోరోగ సామాన్య లక్షణములు.

శ్లో॥ [మతాంతరే] మాంసకీలానిగుదజాన్యర్శాంసిమునయోవిదుః।
తద్రక్తజంచసహజం దోషజంసాన్నిపాతికమ్।
సామాన్యలక్షణంతేషాం మలస్రంసోగ్నిమందతా।
నిస్సారతావివర్ణత్వం సకలామయసంభవః॥

తా. గుదమున మాంసపు మొలకలు జనించిన అర్శస్సని మునులు వచించెదరు. అది రక్తజ సహజ వాతజ పిత్తజ శ్లేష్మజ సన్నిపాతజములని ౬ విధంబులు. అందు మలము పలుచగ వెడలుట అగ్నిమాంద్యము గలుగుట సత్వములేకుండుట శరీరము వివర్ణంబగుట సర్వరోగోత్పత్తికి కారణంబుగనుండుట అనునవి సామాన్యలక్షణములు.

శ్లో॥ [మతాంతరే] దోషజంరక్తజంసాధ్యం శిష్టేద్వేతు పరిత్యజేత్ ।

తా. అందేకదోషము వలన జనించిన అర్శస్సు రక్తార్శస్సు సాధ్యంబులు. త్రిదోషార్శస్సు సహజార్శస్సు అసాధ్యంబులు.

## అసాధ్యార్శోపద్రవములు.

శ్లో॥ [వాహటే] హస్తపాదేముఖేనాభౌ శోథావృషణయోర్గుదే।
హృత్పార్శ్వశూలమోహంచ ఛర్దిస్తృష్ణాజ్వరారుచి।
రక్తాతిసారోరుగ్ణాః కృశ్య మర్శాంసిమారయంతితమ్।

తా. చేతులు కాళ్లు ముఖము నాభి వృషణములు గుదము అనువానియందు వాపుగలుగుట రొమ్ము పార్శ్వములు శూలించుట మోహము వాంతి దప్పి జ్వరము అరుచి రక్తాతిసారము పీడ శరీరకృశత్వముగలుగుట ఈ యుపద్రవములు గల అర్శోరోగులు మరణము నొందెదరు.



శ్లో॥ సహజానిత్రిదోషాణి యానిచాభ్యంతరాం వలిమ్ ।
జాయంతేర్శాంసిసంశ్రిత్య తాన్యసాధ్యాని నిర్దిశేత్ ।

తా. జననకాలము మొదలు స్వాభావికముగ గలిగియుండు అర్శస్సు త్రిదోషార్శస్సు లోనివళులయందు జనించియుండు అర్శస్సు అసాధ్యంబులు.

శ్లో॥ హృత్పార్శ్వశూలం సమ్మోహశ్ఛర్దిరంగస్యరుగ్జ్వరః ।
తృష్ణాగుదస్యపాకశ్చ నిహన్యుర్గుదజాతురమ్ ।

తా. హృదయపార్శ్వములయందు శూల యింద్రియమనస్సులయందు మోహము వాంతి శరీరశూల జ్వరము దప్పి గుదవ్రణము ఈ లక్షణములతో గూడియుండు మూలరోగి మృతినొందు.

శ్లో॥ తృష్ణారోచకశూలార్తమతిప్రసృతశోణితమ్ ।
శోథాతిసారసంయుక్తమర్శాంసిక్షపయంతిహి ।

తా. దప్పి అరుచి శూల కడురక్తస్రావము శోఫ అతిసారముగల మూలరోగి మృతినొందు.

## అర్శోరోగ సుఖసాధ్య లక్షణము.

శ్లో॥ బాహ్యాయాంతువలౌ జాతాన్యేకదోషోల్బణానిచ ।
అర్శాంసిసుఖసాధ్యాని వత్సరోత్పతితానిచ ।

తా. వెలపటి వళియందు జనించిన మూలరోగము యేకదోష ప్రకోపమువలన జనించిన మూలరోగము 1 సంవత్సరకాలము గతించకుండెడి మూలరోగము సుఖసాధ్యంబులని తెలియవలయు.

## అర్శోరోగ కృచ్ఛ్రసాధ్య లక్షణము.

శ్లో॥ ద్వంద్వజానిద్వితీయాయాం వలౌ యాన్యాశ్రితానిచ ।
కృచ్ఛ్రసాధ్యానితాన్యాహుః పరిసంవత్సరాణిచ ।

తా. ద్వంద్వదోషము వలన జనించిన అర్శస్సు 2 వ వళియందు జనించిన అర్శస్సు 1 సంవత్సరకాలము గతించిన అర్శస్సు కష్టసాధ్యంబులని తెలియవలయు. (మరియు వెలపటి ద్విదోష ప్రకోపమువలన జనించిన అర్శస్సు మరియు యేకదోష ప్రకోపమువలన 2 వ వళియందు జనించిన అర్శస్సు కష్ట సాధ్యంబులు.)

### అర్శోత్పత్తికి స్థానాంతరము.

శ్లో॥ మేఢ్రాదిష్వపి వక్ష్యంతే యథాస్వం నాభిజాన్యపి ।
గండూపదాస్యరూపాణి పిచ్ఛిలాని మృదూని చ ॥

తా. మేఢ్రము నాసిక కర్ణములు మొదలగు వానియందు దోషభేదములవలన అర్శస్సు (అంకురము) జనించుచున్నదని ముందుగ జెప్పందగియున్నయది. అట్లేయుండు నదే నాభియందు సగా అర్శస్సు జనించి అది యెఱ్ఱిముఖముతో సమానముగ జిగటగ మృదువుగనుండు.

### వాతార్శస్సునకు అర్శఃకుఠార రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం తు శైకం తు ద్విపలం శుద్ధగంధక
మ్ । మృతం తామ్రం మృతం లోహం ప్రత్యేకం చ పలత్రయ
మ్ । వ్యోషం త్రిఫలా లాంగలీ దంతీ చిత్రకం * పీలుకం తథా ।
ప్రత్యేకం ద్విపలం యోజ్యం యవక్షారం చ టంకణమ్ ।
ఉభే పంచపలే యోజ్యే సైంధవం పలపంచకమ్ ।
ద్వాత్రింశత్పల గోమూత్రం స్నుహీక్షీరం చ తత్సమమ్ ।
† మృద్వగ్నినా పచేత్సమ్యక్ స్థాల్యాం యావత్సుపిండిత
మ్ । మాషద్వయం సదా ఖాదేత్ ప్రసాహ్యర్శఃకుఠారకః ॥

తా. శుద్ధిచేసిన రసము 1 పలము శుద్ధిచేసిన గంధకము 2 పలములు తామ్రభస్మము లోహభస్మము యివి దినుసుకు 3 పలములు త్రికటుకములు చిన్నచర్లగడ్డ నేలదంతి చిత్రమూలము కొండ లేక పుష్కరమూలము యివి దినుసుకు రెండేసి పలములు యవక్షారము టంకణక్షారము యివి 5 పలములు సైంధవలవణము 5 పలములు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నూరి చూర్ణము జేసి గోమూత్రము 32 పలములు జెముడుపాలు 32 పలములు గలిపి మృద్వగ్నితో ముద్దయగువరకు బాగుగ వండి 2 మాషములయెత్తున యెల్లప్పుడు సేవించుచుండిన మూలరోగము హరించు.

శ్లో॥ వచాహింగువిడంగాని సైంధవంజీర నాగరైః ।
మరీచం పిప్పలీ కుష్ఠం పథ్యా చవ్యాజమోదకమ్ ।

* పుష్కరం తథా । † మృద్వగ్నినా పచేత్సర్వం యావత్తత్పిండితమ్.



క్రమోత్తరగుణం చూర్ణం సర్వేషాం ద్విగుణం గుడమ్ ।
అక్షం ముద్గజలైశ్చాను పిబేద్వాతార్శసాం జయేత్ ॥

తా. వస 1 భాగము యింగువ 2 భాగములు వాయువిడంగములు 3 భాగములు సైంధవలవణము 4 భాగములు జీలకఱ్ఱ 5 భాగములు శొంఠి 6 భాగములు మిరియాలు 7 భాగములు పిప్పళ్ళు 8 భాగములు చంగల్వకోష్టు 9 భాగములు కరక్కాయ 10 భాగములు చిత్రమూలము 11 భాగములు వాము 12 భాగములు యిటుల వీనినెల్ల చూర్ణము జేసి దీనికి రెండింతలు బెల్లము గలిపి మర్దించి అక్షప్రమాణమును భక్షించి వెంబడిగ పెసరనీరును త్రాగిన వాతార్శస్సు హరించు.

### పిత్తార్శస్సునకు రాజవల్లభ రసము.

శ్లో॥ లోహాభ్రస్మవిడంగాని త్రిఫలాని శిలాజతు ।
త్ర్యూషణం పిప్పలీమూలం చవ్యం కృష్ణతిలాన్సమమ్ ।
లోహస్య త్రిగుణం వహ్నిం గ్లోహాద్యేలాలతికీ తథా ।
చాతుర్జాతం చ లోహాంశం సర్వస్య ద్విగుణం గుడమ్ ।
కర్షం భుక్త్వా వహంత్యాశు హ్యర్శో మందాగ్ని పాండుకమ్ ।
శ్వాసం భగందరం కాసం శ్వయథుం చ వినాశయేత్ ॥

తా. లోహభస్మము వాయువిడంగములు త్రిఫలములు శుద్ధిచేసిన శిలాజిత్తు త్రికటుకములు మోడి చెవ్యము నల్లనువ్వులు యివి దినుసుకొక్కొకభాగము చిత్రమూలము 3 భాగములు శుద్ధిచేసిన [illegible] 3 భాగములు ఏలకులు లవంగములు ఆకుపత్రి నాగకేసరములు యివి దినుసుకొక్కొకభాగము యిటుల వీనినెల్ల చూర్ణము జేసి దీనికి రెండింతలు బెల్లము గలిపి కర్షప్రమాణమును 4 మాసములవరకు సేవించుచుండిన పిత్తార్శస్సు అగ్నిమాంద్యము పాండువు శ్వాసము భగందరము కాసము వాపు వీనిని హరింపజేయును.

### సామాన్య చికిత్స.

శ్లో॥ [రసరత్నాకరే] సూరణం కాసమర్దం చ శిగ్రువార్తాకవాలు
కమ్ । సుపక్వం భోజయేచ్ఛాకం వథ్యం గోధూమ తండుల
మ్ । కుసుంభ మృదుపత్రాణి హ్యారనాలేన పేషయేత్ ।

భక్షయేచ్ఛాకవచ్ఛాస్త్యై స్వయమగ్నిరసస్తథా ।
నిష్కత్రయంత్రయంనిత్యం గుంజంవానందభైరవమ్॥

తా. కందగడ్డ లేతకసింద మునగ వంకాయ పొడుగుబుడమ వీనిని పక్వముగ వండి భుజింపవలయును. పథ్యము గోధుమలను బియ్యపుపరంటకము భుజింపవలయును. మఱియు లేతపసంబ చిగుళ్ళనుకలితోనూరి శాకమువలెనే భక్షింపవలయును. మఱియు 3 నిష్కములయెత్తు స్వయమగ్ని రసముగాని లేక గురిగింజయెత్తు ఆనందభైరవముగాని ప్రత్యహము సేవింపవలయును.

శ్లో॥ కాకతుండీంద్రవారుణ్యో ర్దేవదాల్యాశ్చ బీజకమ్ ।
సగుడంగుద లేపేన మూలరోగ హరంపరమ్ ॥

తా. పెద్దగురిజవేరు పాపర దాసరదంగివిత్తులు బెల్లము వీనిని నూరి గుదమునందు లేపనమును చేసిన మూలరోగము హరించు.

సూరణాది లేపము.

శ్లో॥ సూరణంరజనీవహ్ని టంకణంగుడమిశ్రితమ్ ।
పిష్ట్వారనాళకై ర్లేపో హంత్యర్శాంసిమహాంత్యపి ॥

తా. కంద పసుపు చిత్రమూలము వెలిగారము బెల్లము వీనిని కలితోనూరి లేపనము చేసిన త్రిదోషార్శస్సు మొదలగు బలిష్ఠములైన అర్శస్సులు హరించును.

నింబాది లేపము.

శ్లో॥ నింబాశ్వత్థస్యపత్రాణాం లేపోదుర్నామనాశనః ।
ఆరనాళేనవాహన్యాత్సగుడాకటుతుంబికా ।

తా. వేపాకు రావియాకు వీనిని నూరి లేపనముచేసినను లేక చేదుసొరకాయ బెల్లము వీనిని కలితో నూరి లేపనముచేసినను మూలవ్యాధి హరించును.

స్నుహ్యాది లేపము.

శ్లో॥ స్నుహ్యగ్నిలాంగలీదంతి మూలైర్లేపోర్శసాంహితః ।
తా. బొంతజెముడుపాలు చిత్రమూలము చెన్నచెర్లగడ్డ దంతివేరు వీనిని నూరి మూలరోగమునందు లేపనము చేయుట హితకరంబు.



అర్కాది లేపము.

శ్లో॥ అర్కాంపయస్స్నుధాకాండం కటుకాలాబుపల్లవాః ।
కరంజోబస్తమూత్రేణ లేపనం శ్రేష్ఠమర్శసామ్॥

తా. జిల్లేడుపాలు జెముడుపాలు కటుకరోహిణి చేదుసొరచిగుళ్ళు క్రానుగవిత్తులు వీనిని మేకమూత్రముతోనూరి మూలరోగమునందు లేపనముచేయుట కడు శ్రేష్ఠకరంబు.

న్యగ్రోధపత్ర లేపము.

శ్లో॥ దగ్ధ్వాన్యగ్రోధపత్రాణి తైలేన సహలేపయేత్॥
తా. మఱ్ఱియాకులగాల్చి బూడిదజేసి నూనెతోమర్దించి లేపనముచేసిన మూలరోగము హరించు.

దేవదాల్యాది లేపము.

శ్లో॥ [శారీరే] దేవదాల్యాశ్చబీజాని సైంధవేన సుమర్దితమ్ ।
ఆరనాళేన లేపోయం మూలరోగ నివృత్తయే॥

తా. దాసరదంగివిత్తులు సైంధవలవణము వీనిని కలిలోనూరి లేపనముచేసిన మూలరోగము హరించు.

త్రిదోషార్శస్సునకు వైక్రాంతాఖ్య రసము.

శ్లో॥ [రసరత్నాకరే] మృతసూతాభ్ర వైక్రాంత కాంతతామ్రం
సమాంసమమ్। సర్వతుల్యేనగంధేన మర్ద్యంభల్లాతకాన్వితమ్।
దినైకంతద్ద్రవైరేవ వటీంకుర్యాద్ద్విగుంజకామ్ । భక్షయే
ద్గుదజాన్హంతి ద్వంద్వజాంచత్రిదోషజమ్ । ప్రత్యష్టముసలీ
వహ్నిభాగాఃషష్ఠస్యషోడశ। పిప్పలీపిప్పలీమూలం తేవేద్యాభ
గద్వయంద్వయమ్ । చతుష్కంతు విడంగస్య మరిచం కటు
శుంఠికా । బ్రహ్మదండితథైకైకం చూర్ణితం ద్విగుణంగుడమ్।
కర్షాంశంభక్షయేచ్చానుహ్యర్శోరోగ ప్రశాంతయే। వైక్రాం
తాఖ్యో రసోనామ సాధ్యాసాధ్యార్శ శాంతయే॥

తా. రసభస్మము అభ్రకభస్మము వైక్రాంతభస్మము కాంతభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనుంచి వీనికిసమముగ శుద్ధిజేసిన గంధకచూర్ణము శుద్ధిచేసిన జీడిగింజలచూర్ణము గలిపి జీడిపిత్తుంగ తైలముతో 1 దినము మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని నేలతాటిగడ్డలు 8 భాగములు చిత్రమూలము 8 భాగములు చంగల్వకోష్టు 16 భాగములు పిప్పళ్ళు శొంఠి రెండేసిభాగములు వాయువిడంగములు 4 భాగములు మిరియాలు చేమటిర కొంతి బ్రహ్మదండి యివి దినుసుకొక్కొక భాగము యిటుల వీనినెల్లచూర్ణముజేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి కర్షప్రమాణానుపానముతో సేవించిన అర్శస్సు ద్వంద్వార్శస్సు త్రిదోషార్శస్సు సాధ్యాసాధ్యార్శస్సులు హరించు.

అభ్రక హరీతకీ.

శ్లో॥ [మాధవనిదానే] మృతాభ్రక పలాన్యష్టౌ స్మృతలోహస్య
పంచకమ్ । గంధకస్య పలంపంచ త్రిభిర్ద్విగుణమాక్షికమ్।
పథ్యాశతపలం యోజ్యం ధాత్రీఫలశతద్వయమ్।సర్వమేకత్ర
తచ్చూర్ణ-జంబీరైర్భావయేద్దినమ్। భృంగీపునర్నవాద్రావైః
* కుమార్యైర్గుడసంయుతైః। భల్లాతవహ్నికోరండైర్హస్తి
శుండీతులాంగలీ। క్షీరిణీజలకుంభీజప్రత్యేకంప్రత్యహాందవైః
భావయేన్మర్దయేదిత్థం మధ్వాజ్యాభ్యాం విలోలయేత్ ।
స్నిగ్ధభాండే స్థితంఖాదే న్నిత్యం నిష్కద్వయంద్వయమ్ ।
సిద్ధశాబరయోగోయం త్రిదోషార్శాం సినాశయేత్ ॥

తా. అభ్రకభస్మము 20 పలములు లోహభస్మము 5 పలములు శుద్ధిచేసిన గంధకము 5 పలములు స్వర్ణమాక్షికము 60 పలములు కరకబెరడు 100 పలములు వుసిరికపప్పు 200 పలములు యిటుల వీనినెల్ల చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో 1 దినము భావనజేసి యెండించి పిదప గుంటగలగర కలిబేసు కలబంద బెల్లము జీడిపలుకులు చిత్రమూలము గోరింట హస్తికుండి (యేనుగపిప్పళ్ళు) చన్నచర్లగడ్డ తవషీరి (అడవిబ్రకపాలు) చేదాసుగ అనువాని రసములతో ప్రతిదానిచే నొక్కొకదినము మర్దించి భావనజేసి తేనె నెయ్యిగలిపి నేతితోమాగిన కుండలోబెట్టి ప్రతిదినము

* పాఠాంకగరదాతలైః—దూసరితీగ నేలతంగేడు.



2 నిష్కములయెత్తును సేవింపుచుండిన త్రిదోషార్శస్సు హరించు. ఈ యోగము సిద్ధశాబరునిచే చెప్పంబడియె.

అర్శోరోగములకు సూరణ వటకములు.

శ్లో॥ ఫలానిషంచపథ్యాయాః పలంమరిచకంతథా। పిప్పలీపిప్పలీ
మూల చవ్యచిత్రక నాగరమ్।ఫలవృద్ధిక్రమేణైన యవక్షారం
పలత్రయమ్।సూరణస్యపలాన్యష్టౌ తథాభల్లాతకస్యచ।గుడే
నగుళికాంకుర్యా దక్షమాత్రప్రమాణకామ్। సాభక్షితాహ
రత్యర్శ శ్చామ్లతక్రానుపానతః।కాంకాయనేనకథితం శస్త్ర
క్షారాగ్నిభీరుణః॥

తా. కరకబెరడు 5 పలములు మిరియాలు 1 పలము పిప్పళ్ళు 1 పలము మోడి 2 పలములు చెవ్యము 3 పలములు చిత్రమూలము 4 పలములు శొంఠి 5 పలములు యవక్షారము 3 పలములు కందగడ్డ 8 పలములు శుద్ధిజేసిన జీడిగింజలు 8 పలములు యిటువీనినెల్ల దంచిచూర్ణముజేసి బెల్లముగలిపి త్రొక్కి అక్షప్రమాణము మాత్రలుజేసి పుల్లనిచల్లతో 1 సంవత్సరమువరకు సేవింపుచుండిన అర్శోరోగము హరించు. ఈ యోగమును కాంకాయనుడనువాడు శస్త్రక్షారాగ్ని కర్మలకు భయపడువారి నిమిత్తమైరచించె.

అర్శోరోగ చికిత్స.

శ్లో॥ అరుష్కరే మూలరోగే చిత్రకం వాప్యరుష్కరమ్ ॥

తా. చిత్రమూలమునుగాని లేక శుద్ధిజేసిన జీడిగింజనుగాని సేవించిన వేదనతో గూడియుండు అర్శోరోగము హరించు. (లేక నేలగొలిమిడి చూర్ణము 1 భాగము చానమల్లెమొగ్గము 1 భాగము పిప్పళ్ళు ¼ భాగము మోడి ¼ భాగము యిటుల వీనినెల్ల నేకముజేసి సేవించినను లేక పుల్లకందనుమారి వెన్నలో సేవించినను వేదనతో గూడియుండు అర్శోరోగము హరించు. పథ్యము పుల్లకందవంటకమును భుజింపవలయు మఱియు చానమల్లెను నేతితో వేయించి దానితోడ కమికెదన్నమును భుజింపవలయు.)

